సాహిత్య
ప్రస్థానం
ఫిబ్రవరి 2017

సంపుటి : 16 సంచిక : 2

## మాతృభాషకే మంగళం?

ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగులో విద్యాబోధనకు స్వస్తి చెప్పాలన్న నిర్ణయం అశాస్త్రీయమే గాక అనర్థదాయకం కూడా. బహుశా ప్రపంచంలో ఎక్కడా మాతృభాషలో చదువుకునే అవకాశం నిరాకరించడం వుండదు. అందులోనూ విద్యా సంవత్సరం మధ్యలోనే ఈ నిర్ణయం తీసుకుని కలకలం సృష్టించడం వూహకందని పరిణామం. విమర్శల కారణంగా దాన్ని వచ్చే విద్యా సంవత్సరానికి వాయిదా వేసినా నడక మాత్రం పూర్తిగా తెలుగు మీడియం రద్దు వైపే సాగుతున్నది. ప్రైవేటు పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం వుంది గనకే విద్యార్థులు అటు వెళుతున్నారనే వాదన ఈ అనర్థక నిర్ణయానికి ప్రాతిపదిక. ఆ మాటకొస్తే ప్రైవేటు సంస్థలు చేసేవి ఇంకా చాలా వుంటాయి. ప్రభుత్వ సంస్థల ప్రత్యేకతలూ ప్రజానుకూలతలతో వాటిని పోల్చడానికే లేదు. అయితే ప్రపంచీకరణ పేరిట ప్రైవేటీకరణకు పెద్దపీట వేసిన ప్రభుత్వాలు కావాలనే ప్రభుత్వ పాఠశాలల ప్రమాణాలు దిగజారడానికి కారణమైనాయి. అయితే ఇప్పటికీ ఉత్తమ ఫలితాలు సాధించే అనేక ప్రభుత్వ విద్యాసంస్థలున్నాయి. అధ్వాన్నమైన ప్రైవేటు విద్యాలయాలూ వున్నాయి. కాబట్టి దీన్ని మీడియం సమస్యకు పరిమితం చేసి ఉన్నఫళాన ఓనమాల బదులు ఏబిసిడిలే నేర్పేస్తామని భీష్మించడం అర్థరహితం. ప్రాథమిక విద్య ఎప్పుడైనా తల్లి భాషలోనే చక్కగా నేర్చుకోగలరన్నది ప్రపంచానుభవం. వైజ్ఞానిక పరిశోధనల సారం. తల్లి పాలతో జన్యువులతో ముడిపడిన సత్యం. గతంలోనే ఇలాటి నిర్ణయాలు తీసుకున్న చోట్ల అద్భుతాలు సాధించిందేమీ లేదు. ఆధునిక కాలంలో ఇంగ్లీషు అవసరమే గాని అదొక్కటి వచ్చేస్తే ప్రపంచం పాదాక్రాంతమైపోతుందన్నది భ్రమే. హిందీ తర్వాత అత్యధికులు మాట్లాడే తెలుగుభాషలో చదువుకునే అవకాశం నిరాకరించడం అప్రజాస్వామికం. బాధ్యతా రహితం. అరకొరగా ఇలాటి నిర్ణయం తీసుకుని చదువులను బలిచేయడం ఇంకా తప్పు. ప్రాథమిక దశలో తెలుగు తప్పనిసరిగా వుండాలనీ, కోరుకున్న వారు ఆ మీడియంలో చదివే అవకాశం వుండాలని మనం కోరుకోవాలి. అందుకోసం అందరం కలసి ఉద్యమించాలి. తల్లిదండ్రులలోనూ విద్యాసంస్థల నిర్వాహకులలోనూ ఆ చైతన్యం పెంపొందించాలి కూడా. ఇందుకోసం ఒక విశాల వేదిక ఏర్పాటు కావడం సంతోషకరం. సాహితీస్రవంతి తెలుగు భాషను బోధనా భాషగా దాని స్థానాన్ని కాపాడేందుకు జరిగే కృషిని యావచ్ఛక్తితో బలపరుస్తుంది.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్

## ఈ సంచికలో ...





మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ఫ్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# రిషితేశ్వరీ.... రిషితేశ్వరీ...

- కోసూరి రవికుమార్
9491336488



క్రోధమెలా పుడుతుందో...!?
కొన్ని సందర్భాల నుంచీ...
కొన్ని పంటి బిగువున భరింప బడే దుఖాల నుంచీ....
ప్రాణ పత్రం నేలరాలిందని
హఠాత్తుగా అందుకున్న కబుర్ల నుంచీ
ఎటునుంచైనా పుట్టొచ్చు... క్రోధం
క్షణికావేశం అని కొందరంటారు గానీ
క్షణాలు ఆవేశాలుగా మార్పు చెందాల్సి వచ్చే
అవలక్షణాల గురించి ఆలోచించరు.
వేధించి
వేటాడి
తగులరాని చోట తగుల బెట్టి
లోలోపలే కాలిపోయేంత
మంటబెట్టిన ప్రవృత్తులు
మార్చురీ బయటే ఎలా నిలబడగలిగాయి

అప్పటిదాకా
తిరిగొస్తుందనుకున్న చిట్టి వాసంతం
ఎడతెగని గ్రీష్మాన్ని ఎదలో నాటి
నిలువునా కూలిపోతే...
చూట్టానికెంత నిబ్బరం కావాలి
లాస్ట్ నోట్‌లో కూడా వాళ్ళ పేర్లు రాయలేనంత
మానవీయత నీకిచ్చిన పెంపకానికి
నమస్కరించాలి

రిషితేశ్వర... రిషితేశ్వరీ...
హైనాల్ని బహిష్కరించి...
నీ లాంటి నెమళ్ళను పోగేయాల్సింది పోయి
నిన్ను నువ్వే ఎందుకు బహిష్కరించుకున్నావ్....!?
క్రోధమెలా పుడుతుందో
తెలీని నీ అమాయకపు చిరునవ్వు...
నీ బేలతనపు సౌందర్యమూ
గుర్తొచ్చినప్పుడల్లా
వాళ్లను చంపెయ్యండీ....
అని అరవాలని అనిపిస్తుంది
కానీ గొంతు పెగలదు
చట్టం కంటే అతీతమైన వ్యథ ఏదో
వాళ్ళ మెదళ్ళను చెదల్లా పట్టాలని మాత్రం
కోరుకోగలం
వాళ్ళు అనుభవించాలని అనేకున్నదేదో
వాళ్ళకు బతుకంతా దొరక్కుండా పోవాలని
కోరుకుంటాం
దాని కోసం దేవులాడి దేవులాడి
ఆ దేవులాట లోనే బతుకు ఆవిరైపోవాలని కోరుకుంటాం
చిట్టి తల్లీ... చిన్న చెల్లీ
మా అమాయకపు జాజిమల్లీ
నీకు మా కన్నీటి తారకాలు
ఇవి జ్ఞాపకాల కార్చిచ్చులు

(ర్యాగింగ్ రాక్షసికి బలైపోయిన రిషితేశ్వరిని గుర్తు చేసుకుంటూ)

## జనవరి నెల పురస్కారాలు

| అలజడి | మెరవణి కథల సంపుటి వర్ణనలు- ప్రతీకలు | గంధాలను అద్దుకుంటూ |
|---|---|---|
| కథకు: రూ.700/- | వ్యాసం: రూ.500/- | కవితకు : రూ .500/- |
| రచయిత : మీనాక్షి శ్రీనివాస్ | రచయిత : లక్కినేని రాజబాబు | రచయిత : సి.హెచ్.వి. లక్ష్మి |

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# వల



- డా॥ కనుపర్తి విజయబక్ష్
9441382303

ఎండలు మండిపోతున్నాయి. ఒక్కసారిగా ఆ రోజెందుకో ఎండాకాలం అయినా ఆకాశం మేఘావృతమైంది. మెల్లగా మొదలైన గాలి ఉధృతమైంది. కొంతసేపటికి అలసి పోయిన గాలి విశ్రాంతి తీసుకొంది. సరే నేను విజృంభిస్తాలే నీవాగిపో అంటు వానదేవుడు తన గొప్ప చూపించటం మొదలు బెట్టాడు. కొద్దిసేపటికే ఇరువురు మిత్రులు కూడబలుక్కుని గాలి, వానతో భూమ్మీద దాడి కొనసాగించారు. వంటగది గడప దగ్గరే కూర్చొని ఈ బీభత్సాన్నంతా చూస్తోన్న వరలక్ష్మి కళ్ళు వర్షధారలతో పోటీపడ్డాయి.

వర్షపు చినుకులు ఈడ్చి మొహాన కొడ్తున్నా పట్టించుకోటం లేదు. ఆ పిల్ల తల్లి వచ్చి బుజం మీద చెయ్యి వేసింది. అప్పటికి గాని ఈ లోకం లోకి రాలేదు.

'ఏమిటే. సందెవేళ గడపలో కూర్చుని ఏడుస్తున్నావు, వేళాపాళా లేకుండా'

'భయంగా వుందమ్మా! ఇంకో పదిరోజుల్లో స్కూళ్ళు తెరుస్తారు కదా...'

'అయితే ఏం'

'నేనింత వరకు ఒక్క అడ్మిషన్ చేయలేకపోయాను. నన్ను ఉద్యోగంలో వుంచుతారో, తీసేస్తారో.... నే నెవర్ని అడిగినా మీ పిల్లల్ని మా స్కూలుకు పంపండి అంటుంటే హేళనగా మాట్లాడుతున్నారు...,!

'ఏమిటే ఈ చిత్రం... అసలు పిల్లల్ని మా బడికి పంపమని అడుక్కోటమేమిటి? ఎవరికిష్టమైన బడికి ఆరి పిల్లల్ని పంపుతారు! అయినా మీ బళ్ళు ఈ రాష్ట్రమంతా వున్నాయి కదా! అంత కరువు ఏమొచ్చిందిట. ఇంటింటికి ఎల్లి అడగాలా?

'లేదమ్మా ! మా స్కూలొకటే కాదు. అన్ని స్కూళ్ళు అలాగే చేస్తున్నాయి. పైగా మేము ఎంత మంది పిల్లల్ని చేర్పించగల్గితే మా కంతలాభం. ఒక్కొక్క పిల్లాడికి వెయ్యి రూపాయల చొప్పున కమీషనిస్తున్నారు. చాలామంది టీచర్లు అపుడే పది, పన్నెండు మందిని చేరుస్తున్నారు. నాకు అదనంగా రావాలనే ఆశ లేదు కాని, నా వుద్యోగం వూడిపోకండా వుంటే చాలు...

'నా వల్ల కాదని చెప్పలేకపోయావా....'

'మొన్న అదీ అయిందమ్మా. ఆ మాటకి ప్రిన్సిపాలు ఏమన్నాడో తెలుసా! నీ లాంటి ఇంకో నలుగురున్నారు. మా అందరికీ క్లాసు తీసుకొన్నాడు. ' ఆ మాత్రం ఒకరిద్దరు పిల్లల్ని చేర్చటం చేతకాలేదా. తల్లిదండ్రులకి వలవేసి పట్టుకోటం చేతకాని వాళ్ళు జీవితంలో ఎంతోమందికి వలవేసి పట్టుకోవాలి.. ఇట్లయితే ఎట్లాగ జీవిస్తారు. చాకచక్యం వుండాలి. కమల చూడండి పదిమందిని జాయిన్ చేసింది. మాట్లాడటం తెలియాలి... సీట్లయిపోతున్నాయి. ఈ లోగా జాయిన్ చేస్తే ఫ్రీ కన్సెషన్ యిప్పిస్తాం. యిట్లా ఏదేదో కల్పించి చెప్పాలి...

ఎబ్బే! ఈ మాత్రం చేయలేరా అని విసుక్కొన్నాడు... ఆ మాటలు భరించలేక శేషారత్నం ఉద్యోగం మానేసింది.



'నువ్వూ మానేయి. ఇంతోటి ఉద్యోగం ఇంకెక్కడా దొరకనట్లు. ఉదయం ఎనిమిది గంటల కెళ్ళి సాయంకాలం ఆరు గంటల కొస్తున్నావు. ఆ బోడి ఐదువేలు ఎలాగైనా సంపాయించొచ్చు...' తల్లి కోపంగా అంది.

"ఏమో! నాకెందుకో ఏ షాపుల్లోను, ఎక్కడా పని చేయబుద్ధవదమ్మా. స్కూల్లో పిల్లల్తో హాయిగా వుంటుంది. కొత్త విషయాలు చాలా తెలుసుకోవచ్చు. అదీ కాక స్కూల్లో అంటే అదో గౌరవం వుంటుంది కదమ్మా!'

' నీ యిష్టమమ్మా. నేనేం చెప్పను. నాకీ పచ్చళ్ళు ప్యాకింగుకి కొంచెం సాయంరా....." అంటూ సీతమ్మ పచ్చళ్ళ బేసిన్లు, ప్యాకింగు కవర్లు పెట్టుకొని కింద కూర్చుంది.

లక్ష్మి కళ్ళు తుడుచుకొంది. వచ్చి తల్లికెదురుగా కూర్చుని చిన్న చిన్న కవర్లల్లో పచ్చళ్ళు సర్దుతోంది. తల్లి ముఖం వాడిపోయి ఉంది. కళ్ళు లోతుకి పోయి, బుగ్గలు పీక్కుపోయి, తెల్లని ఈ ముఖం పాలిపోయినట్లు కనబడుతోంది. అయినా నిరంతరం పని పని. పని చేయటాన్కి పుట్టినట్లుండేది. తండ్రి పేకాట ఆడి, ఆడి అప్పులు చేసి ఇంట్లో చెప్పా పెట్టకుండా, భార్యకిద్దరి పిల్లల్ని తన గుర్తుగా వదిలి వెళ్ళాడు. ఆస్తిపాస్తులు లేవు. ఆదరించే వారు లేరు. పుట్టింది పేరుకి అగ్రవర్ణంలో, పిల్లల్ని చదివించటాన్కి ఏ స్కాలర్ షిప్పులు లేవు. ఏం చేయాలి! సీతమ్మ చాలా రోజులు ఆలోచించింది. భర్త వల్ల ఆ కుటుంబానికి వచ్చిన పేరు ప్రఖ్యాతుల వల్ల ఎవరు పెద్దగా సానుభూతి చూపలేదు... ఏదెలా వున్నా ఆకలి ఆగదు కదా! దానికి తెలీదు కదా ఇంట్లో తింటానికి ఏమున్నా, లేకున్నా దాని టైమ్‌కి అది కడుపులో అలజడి చేసేది. చిన్న బిడ్డల పరిస్థితిని ఆలోచించి సీతమ్మ ఓ నిర్ణయం తీసుకొంది. తనకు వంట చేయటం బాగా వచ్చు. ఒకరిద్దరిళ్ళల్లో వంటమనిషిగా చేరుదామంటే ఆ వూర్లో తమ అగ్రకులపు వారిలో వంటమనుష్యుల్ని పెట్టుకొని భరించేంత స్థితిమంతులెవ్వరు లేరు. పోనీ ఇతర కులాల వారింట్లో తాను చేసే వంటలు చెల్లుబాటు కావు. ఆ కులాల వాళ్ళు తినే వంటలు చేయటం తనకు రాదు.

ఆలోచించగా ఆలోచించగా పచ్చళ్ళు పెట్టి చిన్న చిన్న ప్యాకెట్లుగ, అది అయిదు, పదికే అమ్మితే పనిలోకి వెళ్ళేవాళ్ళకి, పాటుపడేవారికి పనికొస్తుంది కదా అనే ఆలోచన వచ్చింది. తాను పచ్చళ్ళు చాలా బాగా పెట్టగలదు అంతే! వెంటనే కొద్దిపాటి మొత్తంతో ఆ పని ప్రారంభించింది. ఆమె రుచిగా, శుభ్రంగా పెడుతుందన్న పేరు కొద్ది కాలంలోనే అందరికీ తెలిసిపోయింది. ఈ రాబడితో ఇల్లు గడవడం పెద్దగా కష్టం కాలేదు. పిల్లలిద్దరినీ ప్రభుత్వ పాఠశాల్లో చేర్చింది. గుట్టుగా ఇల్లు నడుపుకొస్తోంది. ఆమెకు వచ్చిన పనితో, ధైర్యంగా పిల్లల్ని సాకటమే ధ్యేయంగా పెట్టుకొంది. ఎవరైనా పెద్ద మొత్తంలో పచ్చళ్ళు అడిగితే ముందుగా సగం డబ్బు యిచ్చినట్లయితే చేయగలను అని చెప్పేది. పనయింతర్వాత తక్కిన సగం తీసుకొనేది. అందరు ఆవిడికి అంత క్రితం 'తాగుబోతు కిట్టయ్య పెళ్ళాం' అనేవారు యిప్పుడామే 'పచ్చళ్ళసీతమ్మ'.

పచ్చళ్ళ సీతమ్మ కూతురిగానే లక్ష్మి ఇంటరు పాసయింది. అదే కాలేజిలో శాస్త్రిగారనే లెక్చరర్ చేయూత వల్ల. ఆయన ప్రోత్సాహమీయకుంటే ఆమె ఇంటరు చదివేది కాదు. శాస్త్రిగారింటికి తల్లి యిచ్చిన పచ్చళ్ళు తీసుకెళ్ళడంతో ఆ అమ్మాయి స్థితి గతులాయనకు అర్థం అయినాయి. పరీక్ష ఫీజు ఆయనే కట్టాడు. పుస్తకాలు ఆయనే ఇచ్చాడు. ఈ కార్పొరేట్ స్కూల్లోను ఆయన మాట కాదనలేకనే ప్రిన్సిపాలు వుద్యోగం యిచ్చాడు.

ఆ ఉద్యోగం లక్ష్మికి గొప్పవరం లాగా అనిపించింది. పిల్లలు యూనిఫాంలో రావటం, బస్సులో ఎక్కటం, ఇంగ్లీషులో మాట్లాడటం, వారి తల్లిదండ్రులు ఖరీదైన కార్లల్లో వచ్చి పిల్లల్ని దించి వెళ్ళడం, యివన్ని తానెరగనివి. తన జీవితంలో లేనివి. అంతేకాదు. ఆ పిల్లల తల్లుల్లో కొందరు సినిమా హీరోయిన్ల లా వుండేవాళ్ళు. ప్రిన్సిపాలు గారి గది ఎ.సి., ఎవరు బడితే వాళ్ళు ఆ గదిలోకి వెళ్ళగూడదు. అంత అపురూపంగా అనిపించేది లక్ష్మికి. ప్రతి ఒక్కరు స్టైలిష్‌గా స్టేటస్‌కి ప్రతీకల్లా వుండేవారు. తమ ప్రభుత్వ పాఠశాలలో కూర్చోటానికి బెంచీలు సరిగ్గా వుండేవి కాదు. ఇక్కడ ఎవరి కుర్చీ వారికే. రాసుకోటానికి కుర్చీకే బల్ల. టీచర్లు కూడా ఫ్యాషనబుల్‌గా వుండేవారు. తనతో ఎవరూ ఎక్కువ మాట్లాడేవారు కాదు.

తను నర్సరీ, యల్.కే.జి. టీచర్లుకి హెల్పర్‌గా వుండేది. ఎవరైనా క్లాసు టీచరు రాకుంటే ఏదో ఒక కథ చెప్పటం, పాటలు, పద్యాలు పాడించటం, పిల్లల్ని జాగరూకతతో చూడటం, వాళ్ళు వెళ్ళే వరకు వేయికళ్ళతో వారిని పరిరక్షించటం–ఇదీ

తనపని. తనకు కష్టంగా ఏం అనిపించేది కాదు. అందరు 'లక్ష్మికెంత ఓపికో! వందసార్లు తిరుగుతుంది. అటు యిటు. కాళ్ళు నొప్పులు బెట్టవేమో! ఏమోబాబు లక్ష రూపాయిలిచ్చినా ఈ పని మేం చేయం' అనే వారు అది సానుభూతో హేళనో తన కర్థం అయేదికాదు. తనని కొందరు అవహేళన చేయటమూ తనకు తెలుసు..'ఆయాకి ఎక్కువ టీచర్‌కి తక్కువా' అని 'పోన్లే! నాదేం పోయింది' అనుకొనేది.



ఒక్కోసారి మనసు బాధగా అనిపిస్తే మానేద్దాం అనిపించింది. కాని ఒకేసారి వచ్చే అయిదువేల రూపాయలు, ఇంటి అద్దె, బియ్యం, పాలు అంతే కాదు మధ్య మధ్యలో ఎన్నడూ లేంది పండ్లు తింటున్నారు. తమ్ముడు రవి టెన్త్ క్లాసు. బాగా చదువుతున్నాడు. వాడికి తన జీతం రాగానే మొదటి నెల్లోనే చెప్పులు కొన్నది.. అమ్మకు ఓ చీరె కొన్నది. ఇప్పుడు తీరా తన్ని ఉద్యోగంలో నుండి తీసేస్తే యివన్ని ఎక్కడ్నుంచి వస్తాయి?

స్కూలు ఇంకా రెండు నెలల్లో మూస్తారనగా సెలవలకి ముందు నుండే మార్చి నెల్లోనే ప్రిన్సిపాలు మీటింగుల మీద మీటింగులు పెట్టేవాడు. స్టాపుకి తమ స్కూలు గొప్పదనం తెగ పొగిడేవాడు. మిగతా స్కూళ్ళల్లో లేంది తమ స్కూల్లో వున్నది ఏదో పదే పదే చెప్పేవాడు. టీచర్లకు జీతాలు ఎంతెంత బాగా యిస్తుంది చెప్పి చెప్పి, మీరింకా ఇంకా పిల్లల్ని చేర్చగలిగితే మీకు చాలా బెనిఫిట్సు అనేవాడు. మీ అందరు స్కూలు స్ట్రెంత్‌ని పెంచాలనీ, కనీసం 5 మంది కొత్తవారిని తేగలిగితే కమీషన్ కాక, మే నెలలో జీతంతో కూడిన సెలవు వుంటుందని చెప్పేవాడు.

మీటింగ్ అయ్యేక రకరకాల కామెంట్సు. ప్రిన్సిపాల్‌ని ఇంద్రుడు, చంద్రుడు అని కొందరంటే, మరి కొందరు పిసినారి, లేకి, దరిద్రుడు అనేవారు. ఇంకొందరు ఈ స్కూలు స్ట్రెంత్ పెరిగితే ఈయన కెంత బెనిఫిట్టో.. కొందరేం మాట్లాడకుండా వింటూ వుండేవారు. మరికొందరు ఈ వార్తలు ప్రిన్సిపాల్‌కి మరికొన్ని విశేషాలతో వినిపించేవారు. ఎంతో గొప్ప స్కూలని పైకి కనిపించే 'లోన లొటారమిదా' అనిపించింది లక్ష్మికి.

'లక్ష్మి! ఎన్ని ప్యాకెట్లయినాయి?'

తల్లి ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చింది.

'వందయినాయమ్మా'

'ఇంకా నీవు ఆ పిల్లల్ని చేర్పించటం గురించే ఆలోచిస్తున్నావా'

'స్కూలింకో వారంలో తెరుస్తారు కదమా' దీనంగా అంది లక్ష్మి.

నీవు వుత్తినే దిగులు పడకు. టైలరింగు నేర్చుకుందువుగాని. రెడ్డి గారి భార్య నెలకు వందయిస్తే ఓ గంట కుట్టుపని నేర్పుతుందట. నాకు మొన్నే తెలిసింది. వాళ్ళింటికి వెళ్ళచ్చు.

'ఏదో ఒకటి చేయాలమ్మా! ఉత్తినే కూర్చోలేను. కాని చిన్న పిల్లల్తో నాకెందుకో హాయిగా వుంటుంది. ప్రిన్సిపాలయితే ఎపుడు నాతో అనలేదు కాని; ఎ.ఒ. సార్ నీకు చాలా ఓపికమ్మా' అని మెచ్చుకొన్నారు.

'పోన్లే! నీ విలువ తెలిస్తే వుంచుతారు. లేకుంటే తీసేస్తారు. అంతేగా...'

'నేను నా ప్రయత్నం చేస్తానమ్మా! ఒకరిద్దరిని మీ పిల్లల్ని చేర్చండి అని అడిగితే, నీవు అక్కడ టీచర్‌వా? ఆయావా? అని ఒకామె అంది. మరోకామె 'ఛస్తున్నాం ఈ గోల భరించలేక! రోజూ ఏదో ఓ స్కూలు నుంచి ఎవరో ఒకరు పిల్లల్ని చేర్చండి మా స్కూల్లో అని గోల... మీ స్కూళ్ళ కోసమని ఎంత మంది పిల్లల్ని కనాలి మేము... అని తిట్టింది. నా కేడుపు వచ్చిందమ్మా...

సర్లే! ఇక ఆ గొడవ మానేయి. నేను కూడా ఎవరైనా తెలిసిన వాళ్ళుంటే అడుగుతాలే!

ఇపుడు అడ్మిషన్ల వల తల్లి చేతిలోకి వచ్చింది కూతురి చేతిలోంచి. సీతమ్మ తనకు తెలిసిన వాళ్ళెవరు కన్పించినా కూతురు పనిచేసే స్కూలు గురించి గొప్పలు చెప్పసాగింది. కార్పొరేట్ స్కూలు వాళ్ళకు డబ్బులేని అడ్వయిర్‌టైజ్‌మెంట్. డబ్బున్న వాడి వద్దకే డబ్బు చేరినట్లు, డబ్బు ఖర్చు లేకుండా డబ్బున్న స్కూలు యాజమాన్యానికే సీతమ్మ సాయం చేస్తోంది తెలీకండానే!

ఆ రోజు వాతావరణం చల్లగా వుంది. గాలులు వేగంగా వీస్తున్నాయి. చెట్ల కొమ్మలు విరామమెరుగనట్లు ఊగుతున్నాయి. పంతులుగారు మాగాయి పచ్చడి పెట్టమన్నారు. మామిడి కాయలు ఈ గాలికి రాలిపడితే కొంచెం చౌకగా వస్తాయి. ఎన్ని కాయలు పెట్టమంటారో ఏమిటోనని అడుగుదామని సీతమ్మ బయలు దేరింది. వెదక బోయిన తీగె కాలికి తగిలినట్లు కొంచెం దూరం వెళ్ళేసరికి పంతులుగారి భార్య కనబడింది.

'పచ్చడి గురించి అడుగుదామని బయలుదేరాను' సీతమ్మ అంది.

'ఆ! ఓ ఏభై కాయ పెట్టండి చాలు. అయినా మావారికి ఏ ఊరు వేస్తారో తెలీదు. మేం పిల్లాడ్ని స్కూలు మార్చాలేమో!'

## ప్రజా గజళ్ళు



- చింతాడ రామారావు (సిరా)
9866087709

కలం కుత్తుక ఉత్తరించి కవనజ్వాలను ఆర్పలేరుర
మాంస రచ్చ రగుల గౌలిపి మనిషి మూలం మార్చలేరుర

బుసలు కొడుతు కసాయి తత్వం విషం గక్కుతు సాగుతుంటె
భిన్నజాతుల ఐక్య జెండ భిన్న వదనై నిలిచె గదర

అరాజకాల రాజకీయం అభ్యుదయమును అడ్డగించిన
రాజుకున్న జ్ఞాని మౌనం రాజ్యపీఠం కూల్చుగదర

బడుగు జనుల ఊచకోతతో భూమి దద్దరిల్లుతున్నది
ఒకరినొకరు కూల్చుకుంటె నేల నిప్పుల నగిడి గదర

పేదరోదల పొట్టగొట్టి భాగ్యవంతుల పరువు పరచిన
కలిమిలేముల చిచ్చుచెలగి కాలమాగి పోవు గదర

జనం మనమున నాటబడిన కులం మతముల అంకురాస
నేలమీద నీరుబదులు 'సిరా' నెత్తుటేరులు పారలు గదర ❋

## 'తరువురాగం మేఘుల్హారం'



- ఝాన్సీ కె.వి. కుమారి
9010823014

మేఘమా
నువ్వు కన్పిస్తేచాలు
మా ఎదలు
మేఘ మల్హారాలు

నువ్వొస్తున్న 'చల్లని'
'గాలి' కబురుతో
ధరణి అంతా
పరవశమే!

నువ్వు నవ్వుల
ఇంద్ర ధనుస్సువైతే
నెమలి
నాట్యమయూరమే!

చినుకమ్మా
నేలను ముద్దాడేవా...
మట్టి పరిమళం
ఎంత మాధుర్యం!

పుడమి తాకిన
ముత్యాల తకధిమిలో
మా బాల్యం
కథాక్కళే!

విత్తనం గుండెలో
ఝల్లుమన్నావు
నేలను చీల్చి
మొక్క ఫక్కుమంది!

ఆకులు కొమ్మలు
పూలు మొగ్గలు
అవని అంతా
హరిత హారం

రాలిన చినుకు
చేసింది శ్రుతి
నేల ఆలాపనే
తరువు రాగం! ❋

---

'ఏం పంతులుగారిక్కడే వుంటారన్నారుగా....'

'అనుకొన్నా.. కానీ పిల్లలు లేని సర్కారు బడులన్ని మూతబడిపోతాయట. రెండు మూడు బళ్ళని కలిపేస్తారుట... ఈ బడి మూస్తారిక.

అపుడు సీతమ్మ తలెత్తి చూసింది. తామిద్దరు బడెదురుగా వున్న చెట్టు కింద నిలబడే మాట్లాడుకొంటున్నారు. ఎదురుగా 'మండల ప్రజా పరిషత్తు ప్రాథమికోన్నత పాఠశాల' అనే అక్షరాల్లో కొన్ని అక్షరాలు చెరిగిపోయాయి. బోర్డు ఊడిపోయి తట తట కొట్టుకుంటుంది గాలికి. తరగతి గదుల కిటికీలు ఊచలూడిపోయి సర్వజీవరాశులు లోపలికి ప్రవేశించొచ్చన్నట్లు పర్మిషనిచ్చేసాయి. తలుపులేనాడో ఊడిపోయాయి. ఎంత 'స్వచ్ఛభారత్' అని అరచి గీ పెట్టినా వాళ్ళకు వినిపంచలేదో తెలీలేదో ఇద్దరు ముగ్గురు పిల్లలు ఆ ఆవరణలోనే మలవిసర్జన చేస్తున్నారు. పందులు అటుకేసి యధేచ్ఛగా తిరుగుతున్నాయి...

'మా అబ్బాయి ఎటూ స్కూలుకి బస్‌లోనే వెళ్తాడు కదా! అయినా వీళ్ళ స్కూళ్ళు అన్ని చోట్ల వున్నాయి కదా! ఇక ఎక్కడికైనా మార్చుకోవచ్చు. మా అత్తా మామలతోటే పేచి. వాళ్ళకీ ఊళ్ళో బాగుంది అదొక్కటే ఆలోచిస్తున్నాం... అయినా ఇట్లాంటి బళ్ళల్లో ఎవరు చదువుతారు చెప్పండి. ఉద్యోగస్థులకి తప్పదు. ఏ బడైనా ఎట్లావున్నా... వర్షం వచ్చేలా వుంది వెళ్దామా.... ' అని ఆమె బయలుదేరింది.

పంతులుగారి పిల్లలకే పనికిరాని నేను, ఎవరికైనా ఎట్లా పనికొస్తాను? ఏ రకంగాను విలువలేని నేను ఎవరికి, ఏ విధంగా వల వేయాలో తెలీక ఇలా దిగాలుబడి శిథిలమై కృశించి కుంగిపడిపోయే కంటే నామ రూపాలు లేకండా పోతేనే మంచిది కదా? నాకీ 'సర్కారు బడి' పేరు అస్సలు బాగో లేదు... నా పేరే మిగలకండా చేయగల వారు నేటి సర్కారు వారే. నాకు తొరగా విముక్తి కల్పించండి అన్నట్లు గాలికి ఇంకా వేగంగా తలబాదుకొన్నట్లు కొట్టుకోసాగింది 'మండల ప్రజా పరిషత్తు ప్రాథమికోన్నత పాఠశాల' విరిగిపోయిన బోర్డు. ❋

# అసమ సమాజ నగ్న చిత్రం 'గాలి రంగు'

- డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి
9494081896






***The content of works of art reflects not only reality but also the artists experience of life, historical, political, philosophical and moral views and ideas, his world outlook and his aspirations.***

**(Y. Lukin: Essy 'The active nature of the art of socialist realism' - Marxist Leninist Aeasthetics and life' p.181)**

అసమ సమాజం వైరుధ్యాల పుట్ట. ఆర్థిక సాంఘిక వైరుధ్యాలు రాజకీయ రంగు పులుముకొని రాజ్యమేలుతుంటాయి. ఈ వైరుధ్యాలనే అందంగా ప్రచారం చేయడానికి సాంస్కృతిక రంగాన్ని ఉపయోగించుకుంటుంది పాలకవర్గం. ఈ వైరుధ్యాలలో రాజ్యం అల్ప సంఖ్యాక పక్షం వహించి, అధిక సంఖ్యాక సమాజం మీద పెత్తనం చేస్తుంటుంది. ప్రజారాజకీయ దృక్పథం గల రచయితలు ఈ తలకిందుల వ్యవస్థను ఎత్తి చూపి, విమర్శకు పెడతారు. ఈ వైరుధ్యాల నిర్మూలన వైపు ప్రజల్ని పురమాయించి, వైరుధ్యాలు లేని సమాజ నిర్మాణం వైపు వాళ్ళ దృష్టి తిప్పుతారు. ఈ పని చేయడానికి రచయితలకు తాము నివసించే సమాజ చరిత్ర, దాని పరిణామం, అందులోని వైరుధ్యాలు అందుకు కారణాలు, వాటికి పరిష్కారాలు, ఆ సమాజం సృష్టించిన కళలు సాహిత్యం వంటి విషయ జ్ఞానం అవసరం. ఆ సమాజంలోని వైరుధ్యాల నిర్మూలన కోసం జరిగిన ప్రయత్నాల సారం తెలియాలి. ఆ ప్రయత్నాలు చేస్తున్న వాళ్ళ పక్షం వహించాలి. వాళ్ళ పట్ల మమేకత కలిగుండాలి. తాము ప్రశ్నించదలచుకున్న, ప్రతిఘటింపదలచుకున్న అంశాలను అభివ్యక్తం చేయడానికి అవసరమైన భాషా, భావుకతా సంపదను సమకూర్చుకోవాలి. సారాంశంలో ప్రజాతంత్ర రచయిత ప్రతిపక్ష పాత్రని నిర్వహించాలి.

'గాలి రంగు' కావ్యంలో ఈ లక్షణాలన్నీ పుక్కిటి బంటిగా ఉన్నాయి. ఈ కావ్యం నిండా రాజకీయం ఆవరించి ఉంది. సామాజిక వైరుధ్యాల గుట్టు విప్పింది ఈ కావ్యం. వైరుధ్యాలు సృష్టించిన సంక్షోభానికి అక్షరాకృతి ఈ కావ్యం. "ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న రోజులలో కూడా నాది విస్పష్ట స్వరమేనేమో కాని, మార్మోగిన స్వరం కాదు" అని కవి ఇచ్చుకున్న వివరణ అంత ముఖ్యం కాదేమో! సమాజంలోని అసంగతసంగతుల్ని గుర్తించి వాటిని విమర్శకు పెట్టడంలో దేవి ప్రియ నిబద్ధతతో వ్యవహరించారు. దానిని ఎంత స్థాయిలో చేశారన్నది తర్వాతి విషయం. 'గాలి రంగు' కావ్యం నిండా రాజకీయ స్వరాన్ని వినిపించారు. 'నీ రాజకీయాలేమిటి?' అని ఎవరో కవిని ప్రశ్నించారట.

***సంతృప్తి దాచుకోకు/అసంతృప్తిని ప్రకటించు/ఆగ్రహాన్ని వ్యక్తం చేయి/నిష్పాక్షికత నటించకు/ధర్మానికి తటస్థత సాధ్యం కాదు***

ఇంతకన్నా స్పష్టమైన రాజకీయ స్వరం ఎక్కడుంటుంది? ఆయుధం అలీనం కాదు అన్న శ్రీశ్రీ మాటకు కొనసాగింపు ఇది. "నెత్తురోడుతున్నా తల వంచని నా ఆత్మగౌరవ ప్రతిపత్తి"

అన గలిగిన కవి నిబద్ధత కల్తీలేనిది. దివ్య హంస అనుకున్నది డేగలాగా రివ్వున దిగివచ్చి కలువ చేతులలో శిలువ మేకులు దించే హింసా చరిత్రను గుర్తించగలగటం కవి రాజకీయ స్పృహ.

*ఇప్పుడు/రోజుకొక నవ ప్రవక్త/ఊరుకొక నీతి ప్రయోక్త*
*చెదలు పుట్ట పగిలినట్టు*

ఆధ్యాత్మికత ముసుగులో, ఆశ్రమాల ముసుగులో కొత్త రకం దోపిడి మౌఢ్యం పెట్టుబడిగా ఎలా కొనసాగుతున్నదో వ్యాఖ్యానిస్తున్న ఈ ఖండికలో...

*వినియోగ విశ్వవ్యాకరణంలో*
*అస్తవ్యస్త వాక్యమైపోతున్న మానవ ఉద్వేగమా!*

కన్స్యూమరిజం పేరుతో మార్కెట్ ఎకనామీని అభివృద్ధి చేస్తున్న ప్రపంచీకరణ ముసుగు తొలగించి చూపుతున్న వాక్యమిది.

*ఏడాది పొడుగునా/ఈ దేవుళ్ళ హుండీలలో పడే/ ధగధగల బంగారమంతా కలిసినా /ఒకపొద్దున ఒక గట్టున ఒక మొక్కకి పూసిన/ఒక్క బంతిపూవుతో తులతూగలేదు.*

ఆ మధ్య స్వాముల మధ్య ఏర్పడిన వైరుధ్యాలలో ఒక స్వామి గుడికి పోతే పబ్బుకు పోయినట్టుంది అని వ్యాఖ్యానించాడు. ఆ మాట సామాన్యుడు అని ఉంటే వాడిగతి ఏమయ్యేదో గాని, బలవంతుడు అనడం వల్ల సరిపోయింది. ఇవాళ మత క్షేత్రాలు, ఆధ్యాత్మిక కేంద్రాలు వాటి ఆధ్యాత్మిక స్వభావాన్ని కోల్పోయి టూరిస్టు సెంటర్లుగా మారిపోయాయి. గుడుల చుట్టూ సంపద తిరుగుతున్నది. అంతా కృత్రిమత్వం తాండవం చేస్తున్నది. కవి సహజంగా వికసించే బంతిపువ్వు వైపు నిలబడ్డాడు. ఆడంబరమే అసలైన జీవన విధానంగా మారిపోతున్న సమయంలో కృత్రిమ మానవ సంబంధాలే అసలైన మానవ సంబంధాలుగా మారిపోతున్న సమయంలో కవి నిరాడంబరత్వం వైపు, సహజత్వం వైపు నిలబడ్డారు. ఈ నిలబడడం అనేక ఇతరాంశాలకు సంకేతం.

ఇది కాలుష్య యుగం. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రపంచానికిచ్చిన కానుకలలో కాలుష్యం ప్రధానమైనది. అత్యధిక శాతం వనరులు బడా పెట్టుబడిదారులు, దోపిడీదారుల కబంధహస్తాలలోకి వెళ్ళిపోయింది. వాళ్ళ పరిశ్రమలు, వాళ్ళ గనులు, వాళ్ళ వ్యాపారాలు, వాళ్ళ దోపిడి సామాన్య ప్రజలకు కాలుష్యాన్నే మిగిలిస్తున్నాయి. నీటి కాలుష్యం, గాలి కాలుష్యం, తిండి కాలుష్యం, మందుల కాలుష్యం, భాషా కాలుష్యం, సభాకాలుష్యం అంతా కాలుష్యమే. కాలుష్యమే జీవితమైపోయింది. స్వచ్ఛమైన జీవితాన్ని కోరుకునే కళాకారులు ఈ కాలుష్యాన్ని ధిక్కరించక వదలరు. 'చిరుమాలిన్యం' కవిత రాజకీయ కాలుష్య ప్రతిఫలనం. ఈ కవితలో ప్రకృతి ఆవిర్భావం, ప్రపంచ పరిణామాన్నంతా చెప్పి మనం ఎంతో దూరం నడిచొచ్చాం, ఎన్నో సాధించాం కాని

*"మనిషి మాలిన్యాన్ని/ ఇన్ని నులివెచ్చని కన్నీళ్ళతో*
*కడిగి శుభ్రం చేయలేక పోయాం"*

అని నిర్ధారించారు. ఒకవైపు మానవుడు సాహసోపేతమైన పనులు చేస్తూనే మరోవైపు మాలిన్యాన్ని మాత్రం కడుక్కోలేక పోయాడని కవి చురక వేశారు. మనిషి స్వార్థం ప్రపంచానికి చేసే చెడు అతని విజయాలు ప్రపంచానికి చేసే మేలును మరపింప జేస్తాయన్న వేదన ఈ కవితలో దాగుంది.

అజ్ఞానం వల్ల కావచ్చు, భయం వల్ల కావచ్చు మనిషి తనకన్నా శక్తివంతమైనదని ఒక కాల్పనికశక్తిని సృష్టించుకొని, దానికి తానే బానిసయ్యాడు. చరిత్రను తాను సృష్టిస్తూ, దానికి దైవాన్ని కర్తను చేశాడు. తన సృష్టికి తానే బానిసయ్యాడు. ఈ బానిసత్వం ప్రపంచ వ్యాప్తంగా సృష్టిస్తున్న సంక్షోభాలు అన్నీ ఇన్నీ కావు. ఇదొక వైరుధ్యం. దేవి ప్రియ 'గాలి రంగు' కావ్యంలో ఇలాంటి అనేక వైరుధ్యాలను ఎత్తి చూపి విమర్శకు పెట్టారు.

*"ఇంకెన్నాళ్ళు ఈ/ మహిత మానవశక్తి విస్మరణకాండ/ ఎన్నాళ్ళు కలలు కంటారు/ కోటానుకోట్ల దేవతల దీవెనల గురించి/ చరిత్ర నిర్మాణ శిల్పుల/ చేతి చలువల కథలు ఎవరూ గానం చేయరేం?*

ప్రపంచీకరణ యుగంలోనూ ఈ వైరుధ్యం కొనసాగుతున్నది. పురోహితవర్గం పెట్టుబడిదారీ వర్గం తప్ప, ప్రపంచీకరణలో బాగుపడ్డ వాళ్ళు అరుదు. మానవ మేధస్సు సాంకేతికంగా సాధించిన విజయాలను భూస్వామ్య పెట్టుబడిదారీ శక్తులు స్వాయత్తం చేసుకొని, ఆర్థిక వైరుధ్యాలు, దోపిడీ కొనసాగుతూనే ఉన్నాయి. రెండు ప్రపంచాల వ్యవస్థను ప్రపంచీకరణ ఇంకా ఎక్కువ చేసిందేగాని తగ్గించలేదు.

*ఒకచోట పిడచకట్టిన నోళ్ళు/ నీళ్ళకోసం మైళ్ళు మైళ్ళు నడిచిపోతాయి/ ఒకచోట అసంఖ్యాక రుచులతో/ అతిథి మర్యాదలు ఆదరంగా సాగిపోతాయి.*

అని దేవిప్రియ ఒకే ప్రపంచంలోని రెండు ప్రపంచాలను ఎత్తి చూపారు.

ప్రపంచం విభజితమై ఉన్నప్పుడు ఆ విభజన అంతటా ఆవరించి ఉంటుంది. అన్ని రకాల ప్రజా సమూహాలలోనూ ఉంటుంది. దేవి ప్రియ స్త్రీలలో కూడా ఈ విభజనను గుర్తించారు. ఇంటిల్లిపాదీ గోరింటాకు అరచేతులకు అద్దుకొని ఎర్రదనాన్ని పండించుకొని భర్తలను మురిపింప జేసే వర్గం ఒకటైతే, అయినవాళ్ళందరికి దూరంగా అరణ్యాలలో యుద్ధం చేసే ఆదివాసీ మహిళా వర్గం ఇంకొకటి. 'గోరింట' అనేది మంచి యుద్ధ కవిత.

దేవిప్రియ పాలక పాలితవర్గాల మధ్య గల ఆర్థిక వైరుధ్యాలను "నాలుగు రాజభవనాలు- ఒక మూడు గదుల ఇల్లు" కవితలో మరింత స్పష్టంగా ఆవిష్కరించారు. పాలకులు సకల సంపదలనూ, అధికారాన్ని గలిగి వైభవంలో మునిగితేలుతుంటే మరో వైపు ప్రజలు, శ్రామికులు దైనందిన సమస్యలలో కొట్టుమిట్టాడుతుండడం వర్గసమాజ లక్షణం. చరిత్రలోనే కాదు, వర్తమానంలోనూ. పాలకులు అనేక అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాల నిర్వహణలో తలమునకలు వేస్తున్న వర్తమాన కాలంలోనూ ఈ ఆర్థిక విభజన కొనసాగుతూనే ఉందని కవి చేసిన నిష్కర్ష. దోపిడీ వ్యవస్థ ఎంత సజీవంగా కొనసాగుతున్నదో ఈ కవిత ఆవిష్కరించింది.

*"ఒక రాకుమారుడికి/ నాలుగు విలాసభవనాలూ/ కొన్ని కర్మాగారాలూ, వార్తా ఉత్పత్తి కేంద్రాలూ..."*

*"ఇంకొక పేదరైతు కొడుక్కి/ తొమ్మిదేళ్ళ రాజ్య ఏకఛత్రాధిపత్యం/ వందల కోట్లు మాత్రమే విలువ చేసే క్షార వ్యాపారం"*

అన్న వాక్యాలు స్పష్టంగానే ఉన్నాయి. *ఇదొక వర్గం*

***కోట్లాదిమంది భారత పౌరులు/ అందరూ వున్న అనాథలయిపోయారు***

ఇది ఇంకొక వర్గం. ఈ వైరుధ్య జ్ఞానమే రచయితను నిర్వచిస్తుంది. ఇది మార్క్సిజం అందించిన జ్ఞానం. ఇన్ని వైరుధ్యాలను గుర్తించిన దేవిప్రియ ఈ సమాజాన్ని 'గోడలు' అని నిర్వచిస్తూ, శ్రీశ్రీ 'గంటలు' కవిత వంటి కవిత రాశారు. "మాకు గోడలు లేవు. గోడలు పగుల గొట్టడమే మా పని" అని శ్రీశ్రీ ఎనిమిది దశాబ్దాల క్రితమే ప్రకటించినా, ఆ గోడల వ్యవస్థ బలపడుతూనే ఉన్నది. దేవిప్రియ కవిత దీనినే ప్రతిఫలిస్తున్నది.

*"గోడలు గోడలుగా లోకం"*

ఈ గోడల వ్యవస్థ ప్రపంచమంతా కొనసాగుతుందని ఈ కవిత ప్రతిపాదించింది.

*శ్వేతసౌధాలు/ టెన్‌డౌనింగ్ స్ట్రీట్‌లు/ పదిజనపథ్‌లు/ గోడల మధ్యనే*

మార్క్సిజాన్ని తాత్విక శాస్త్రంగా స్వీకరించిన రచయితకు మనిషే సర్వస్వం. మానవుడే చరిత్ర నిర్మాత. మంచికైనా చెడుకైనా మనిషే. ఈ వర్గ సమాజం వర్గ సంఘర్షణల సమాజం. వర్గయుద్ధాల సమాజం. దేవిప్రియ "గెలుద్దాం" కవితలో ఈ జ్ఞానాన్ని కవిత్వీకరించారు.

*"అక్కడా ఇక్కడా మనమే/ అదీ ఇదీ కూడా మనమే/ వైవిధ్యం మనమే వైరుధ్యం మనమే/ మనతో మనకి యుద్ధం తప్పదు/ మనలో ఒకడు గెలవాలి/ మనలోపలే ఒకడు ఓడాలి"*

మార్క్సిస్టు రచయితది అంతర్జాతీయ దృష్టి, విశ్వజనీన వాదం. స్థానికత నుండి విశ్వజనీనతవైపు మార్క్సిస్టు రచయిత ప్రయాణం సాగుతుంది. దేవిప్రియది మార్క్సిస్టు తత్వమే. ఆయన గగన భీభత్సం చల్నేదో, తెలుగు శాసనం కవితలలో తెలంగాణ రాష్ట్ర నిర్మాణాన్ని ఆహ్వానించారు. దానికోసం జరిగిన ఉద్యమాలను స్వాగతించారు.

*"ప్రపంచకుటీరంలో/ తెరుచుకోనీ ఇంకొక కొత్త కిటికీ"*

*"అయినా/ నష్టమేమిటి తెలుగువాడా/ అనుభవిద్దాం విడిగ కూడా"*

ఈ ప్రాదేశికత నుండి ఆయన విశ్వం వైపు పయనిస్తూ 'అచరిత్ర' వంటి అనేక కవితలు రాశారు.

*"సెల్యూలార్ జైలు ఉరికొయ్యలకు వేలాడినా*
*ఉగాండా అడవుల్లో తిరగబడి నేలకొరిగినా*
*నల్లమల అరణ్యాలలో స్మారక స్థంభాలై నిలిచినా*
*త్యాగం ఒక్కటే"*

"గాలి రంగు" కావ్యం ప్రపంచమంతా ఆవరించిన అసమసమాజ నగ్న చిత్రాన్ని కవితాత్మకంగా ఆవిష్కరించింది. దాని బహుముఖాలను చిత్రించింది. దానిని ధ్వంసం చేయాలని జరిగే ప్రయత్నాలను కీర్తించింది.

***The artist perceives and reflects the world synthetically in all its diverse intereltionships and links.***

**(E.G. Yokolev: Essy on irrational and rational nature of art' - Marxist Leninist Aeasthetics and life p.181)**

✵

## వాడు తెలీని అనంతం అంటాడు



- జ్యోతి నందూరి

వాడు తెగిన గాలిపటంతో ఆకాశం ఎక్కాలనుకుంటాడు
శూన్యంలో నీళ్లు తోడుకుంటాడు
చెమరించే కళ్ళలో ఓ నవ్వును పులుముకుంటాడు
కనురెప్పల వెనుక చిగురించే ఆశకోసం
గూడు కట్టుకుంటాడు
దారిపొడువునా రంగులు అద్దుతాడు
నీ మనసులో దూకి ఓ ఆకలి మెతుకౌతాడు
మట్టితేలిన ఇంకో మెతుకుకు చిటికెన వేలవుతాడు
మాట్లాడాలనిపిస్తే శిఖరపు అంచునుండి
జారుతున్న జలపాతాన్ని చూస్తాడు
పిసికిన మట్టిని ఓ కాలంలా చేసి
అక్షరాలను జల్లెడలో రాస్తాడు
వాడిన పూలలో వచ్చిన సుగంధాలతో
చిరునవ్వులు చిందిస్తాడు
నాలుగు దిక్కులు తనవేనంటాడు...
నాకేముందో నాకే తెలీనంత అనంతం అంటాడు...

## నీలి జెండ తారక

- దొడ్డి రామ్మూర్తి
9848975264



నది పుట్టిన గొంతుక
ప్రజల హక్కు తారక
పోరాటం కానుక
బుద్ధుడి ఆవేదనల
సద్దిమూట నీవికా
అంబేద్కర్ ఆలోచన
కలల సాకారమా
గుండె గోదారిపైన
అలల సంగీతమా
అణగారిన బతుకులకు
కత్తిమొన గీతమా
కలం కంటి చూపులో
లోకం కల గంటివా
పీడిత జన హోరులో
నీలిజెండ తారక
అసమాన సంఘంలో
సమత బాట సారమా
పేదలింటి దీపమయ్యి
ప్రేమ చూపు తారక

(ప్రజల బొండిగె బొజ్జా తారకం యాదిలో...)

## గమనిక

**సాహిత్య ప్రస్థానం చిరునామా మారింది.**

రచనలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు
ఈ దిగువ చిరునామాకు పంపగలరు

సాహిత్య ప్రస్థానం
27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు
ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002
ఫోన్: 0866-2577248, సెల్: 9490099059

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## సాహిత్య ప్రస్థానం పత్రికకు చందా కట్టారా?

సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి!
తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!

1 సంవత్సర చందా రూ. 120/-
5 సంవత్సరాల చందా రూ.500 /-
10 సంవత్సరాల చందా రూ. 1000/-

Bank Details: SBH, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBHY0020343

చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

# పట్టుదల

- డా॥ కొలకలూరి మధుజ్యోతి
9441923172


Gangadhar

'నమస్తే మేడమ్! నేను డిఎల్‌గా సెలెక్ట్ అయ్యాను' రూంలోకి ప్రవేశిస్తూ, వికసించిన మెహంతో పెదవులపై చిరునవ్వుతో చెప్పింది సుధ . రాసుకొంటూ ఉన్న లెక్చరర్ లత తలెత్తి చూసింది. ఎదురుగా ఆనందంగా సుధ.

రాస్తున్న పెన్ను మూసి, పాడ్‌ను టెబుల్‌పై పెట్టి, లేచి, టేబుల్ దాటి సుధ దగ్గరకు చిరునవ్వుతో వచ్చి ఆలింగనం చేసుకొంది లత.

మేడమ్ చర్యతో తబ్బిబ్బు అవుతున్న సుధకు అభినందనలు తెలిపి కూర్చోమంది లత.

'నువ్వు అభివృద్ధిలోకి వస్తావని నాకు తెలుసు' ఆనందంగా చెప్పింది లత.

సుధ కళ్ళలో ఆనందపు తడి.

* * *

ఎం.ఏ. ప్రథమ సంవత్సరంలో చేరింది సుధ. స్కాలర్‌షిప్పుకు అప్లై చేసింది. ఆఫీసు వాళ్ళు రమ్మని కబురు చేశారు. వెళ్ళింది. సుధ ఇచ్చిన రేషన్ కార్డు, అందులో తండ్రి ఫోటో లేదు కాబట్టి చెల్లదు. సుధది, తల్లిది, తండ్రిది ఆధార్ కార్డు కాపీలు అడిగారు. సుధ దగ్గర తండ్రి ఆధార్ కార్డు లేదు. కనుక స్కాలర్‌షిప్పు రాదని చెప్పారు. సుధ లత దగ్గరకు వచ్చింది.

స్కాలర్ షిప్పు రాదని తెలిసి 'ఏం... కాస్టు సర్టిఫికేట్ లేదా.....?' అడిగింది లత.

'కాస్టు కాదు మేడమ్ ఎకనామికల్ బ్యాక్‌వార్డు' చెప్పింది సుధ.

'మరేమిటి సమస్య....?' లత

ఏం సమాధానం చెప్పకుండా తలవంచుకొని నిల్చొంది సుధ. చెప్పగలిగిన సమాధానం లేదని, ఏదో చెప్పటానికి సంశయిస్తూ ఉందని అర్థం అయ్యింది లతకు.

'వాళ్ళకు ఏం కావాలంట.......?' అనునయంగా అడిగింది లత.

'మా నాన్న ఆధార్ కార్డు......!' వంచిన తల ఎత్తకుండా చెప్పింది సుధ.

అవి ఆధార్ కార్డు ఇస్తున్న తొలి రోజులు. కొందరు తీసుకొన్నారు. కొందరు తీసుకోలేదు. కొంత అయోమయం అలుముకొన్న రోజులు. తండ్రి ఆధార్ కార్డు లేకపోవటానికి అదే కారణం అనుకొంది లత. అదే అడిగింది సుధను

'మీ నాన్న ఇంకా ఆధార్ కార్డు తీసుకోలేదా.....?'

'నాన్నే లేడు....!' సంకోచిస్తూ చెప్పింది.

'అయ్యో...! నాన్న లేకపోతే డెత్ సర్టిఫికెట్ ఇస్తే

సరిపోదా!?!'

'నాన్న చనిపోలేదు!' నిర్వికారంగా చెప్పింది.

నివ్వెరపోవటం లత వంతు అయ్యింది. ఇది అసాధారణం. స్పష్టంగా లేని మానవ సంబంధాలు. దాని వల్ల సంక్లిష్టం అవుతున్న స్కాలరుషిప్పు వ్యవహారం. సున్నితమైన విషయం. మెల్లగా చిక్కు ముడి విప్పాలి. ఆలోచిస్తూ .....సుధను చూసి అడిగింది లత.



'అమ్మా, నాన్న విడిపోయారా?' తల అడ్డంగా ఊపింది.

'సుధా ఏం అనుకోకు..... ఇలా అడుగుతున్నందుకు. మీ నాన్న వేరే పెళ్ళి చేసుకొన్నాడా ....?!

'మాకు నాన్నే లేడు మేడమ్....' రోషంగా కోపంగా చెప్పింది. అర్థం కాని చూపు చూసింది లత. నిజంగానే లతకు ఏమీ అర్థం కాలేదు.

'అవును మేడమ్! మాకు నాన్న లేడు. మా చిన్నప్పుడే మా అమ్మను వదిలేసి దుబాయ్ వెళ్ళాడు. మళ్ళీ రాలేదు. ఇంకొకరిని చేసుకొన్నాడని అంటారు. మాకు తెలీదు. బతికున్నా....మాకు ఆయన చచ్చినట్టే..... మమ్మల్ని చిన్నప్పట్నుంచి మా మామే సాకుతున్నాడు....!' దు:ఖం ఉక్రోషం కలగలసిన గొంతుతో చెప్పింది. వాళ్ళిద్దరి మధ్య నిశ్శబ్దం....!

తేరుకొన్న లత అనునయంగా'.... సెక్షన్‌లో సుబ్బారావు అని ఉంటాడు. ఇలాంటివి అతడికి తెలుసు. నేను పంపానని చెప్పు. అతన్ని కనుక్కో.....! ఏం చెయ్యొచ్చో చెబుతాడు' అని చెప్పి పంపింది.

ఎలాంటి సమస్య అయినా దానికి ఏదో ఒక పరిష్కార మార్గం ఉంటుంది. సమస్యలో ఉన్నవారికి అది ఒక్కటే తెలుసు. కాని స్కాలర్‌షిప్పులు ఇచ్చే సీట్లో వ్యక్తికి సంవత్సరాల అనుభవంలో ఎన్నో సమస్యలు తెలుస్తాయి. పరిష్కారాలు తెలుస్తాయి. వేల అప్లికేషన్లు.....వేల మంది పిల్లలతో పని చేసే క్రమంలో....సమస్యను పూర్తిగా మనసు పెట్టి వినే సమయం ఓపిక ఉండవు. అలాంటప్పుడు కొందరు నష్టపోతారు. సుధకు స్కాలర్‌షిప్పు రాదనే విషయం ఆఫీసులో అందరికీ తెలుసు. కొంచెం వివరం అడిగి తెలుసుకొంటే సహాయం చేయగలరు. సహనం ఉంటే సమయం ఉండదు, సమయం ఉంటే సహనం ఉండదు. వారినీ అనలేం. అపరిమితమైన పని ఒత్తిడి. సుధ వచ్చి లతకు చెప్పింది. ఏదో ఒక మార్గం దొరకొచ్చు. కాని, అందరికి అలా అవకాశం కలగదు. ఎవరికీ చెప్పుకోలేక..ఏం చేయాలో తెలీక ఫీజు ఎలాగో కష్టపడి కట్టేవారు..., డబ్బులేక చదువుకోలేక ఆపేసే వారు....ఎందరో.....!

వారం తర్వాత వచ్చింది లత దగ్గరకు....'అప్లై చేశాను' అంటూ ఆనందంగా.

'ఏం చెప్పారు....ఎలా చేశావు....? ప్రశ్నించింది లత.

'మా ఊరి సర్పంచి నుంచి చాలా కాలంగా తండ్రి దుబాయ్‌లో ఉంటున్నాడని తెలుపుతూ ఓ లెటరు, అలాగే మా గురించి తెల్సిన ఓ గెజిటెడ్ హోదా ప్రభుత్వోద్యోగి నుంచి ఓ లెటరు తెమ్మన్నారు. తెచ్చిచ్చాను మేడమ్. 'భయం లేదులే వెళ్ళమ'న్నారు మేడమ్. థాంక్స్ మేడమ్.....!' ఆనందంగా చెప్పింది.

'సంతోషం, బాగా చదువు మరి.....!' లత అప్యాయంగా చెప్పింది. సమస్యను ఎవరో ఒకరికి చెప్పి మార్గం వెతుక్కొన్న సుధలోని స్వభావం లతకు నచ్చింది.

ఆపై లత ఆ విషయం మర్చిపోయింది. సుధ ఆమెను కలవలేదు. రెండో సంవత్సరంలో ఉండగా మళ్ళీ సుధ లత రూంకి వచ్చింది.

'మేడమ్ రెండు వేలు కావాలి...' కళ్ళలో నీరు.

'ఎందుకు.....?' లత అడిగింది.

'మావయ్య ఇంటి రెంటు కట్టమని డబ్బు ఇచ్చాడు. అమ్మ అది వేరే అవసరానికి వాడింది. రెండు మూడు రోజుల్లో స్కాలర్‌షిప్పు వస్తుంది...అప్పుడిచ్చేస్తా......! కావాలంటే మా అమ్మతో కూడా చెప్పిస్తా.....' ఫోను ఉన్న చేతిని ముందుకు చాచి చెప్పింది.

'మొన్న నెలే స్కాలర్‌షిప్పులు వచ్చాయి......!' లత ప్రశ్న ఇంకా పూర్తి కాలేదు. కళ్ళలో ఉన్న నీరు చెలియలి కట్ట దాటాయి. మేడమ్ అనుమానిస్తున్నారేమో అనే సందేహం సుధలో.....!

'నాకు రాలేదు మేడమ్......' చెప్పింది.

లతకు అప్పుడు అనుమానం కలిగింది. సుధ మీద కాదు.....సాంఘిక సంక్షేమ శాఖపై. సుధ అపోహ

# చీడ వదల్లేదు

- కోగిల చంద్రమౌళి
9573187218

నకిలి ఎరువులు, పురుగు మందులు
గిట్టుబాటుకాని ధరలు ప్రకృతి వైపరీత్యాల్లో
సేద్యం బారమవుతున్న వేళ
పలువు తాళ్ళు మేనాల్సిన చేతులు
ఉరితాళ్ళవుతున్నాయి
పంటలకు వచ్చే చీడపీడలు
ప్రకృతి వైపరీత్యాల కన్నా
ఏలికలనుసరిస్తున్న విధానాల్లో
తేడా వల్లనే
వ్యవసాయం వట్టి పోతుందని



మంచె కర్రలకు, చేనుగట్టు చెట్ల కొమ్మలకు,
మోటారు షెడ్ల కింద శవాలైతె లాభం లేదని
ఈ మధ్య రాజధాని వీధుల్లో, అసెంబ్లీ
ఆవరణల్లో సాక్షత్తు రైతే
దిష్టిబొమ్మై - పాలక పశువుల్ని
అదిలించబోయిండు
ఐనా.....
ప్రపంచీకరణ మోజులో కార్పోరేట్
మత్తెక్కిన ఈ చీడ వదల్లేదు
సరికదా!
మళ్ళీ మళ్ళీ అవే విధానాలు
ఒక్కటే ప్రహసనం!!

*

తొలగించటం ముఖ్యం అనుకొంది.

'కళ్ళు తుడుచుకో......డబ్బు ఇస్తాను....కంగారు పడకు' ఓదార్పుగా చెప్పింది.

'పోయిన సంవత్సరం వాళ్ళడిగిన కాగితాలు ఇచ్చావుగా.......?! ఇంకేమిటి......?' ఎక్కడ పొరపాటు జరిగిందో తెలుసుకోవాలని అడిగింది లత.

'ఏమో మేడమ్ రాలేదు....నాలాగే ఇంకో అమ్మాయి కూడా ఇచ్చింది. తనకు స్కాలర్‌షిప్పు వచ్చింది. నాకు రాలేదు......' చెప్పింది. కాని ఆ గొంతులో దిగులు లేదు.

'సెక్షన్‌లో సుబ్బారావును అడగలేదా......!'

'అడిగాను మేడమ్... నా విషయం మొత్తం గుర్తు చేశాను. ఇప్పుడేం చేయలేం. ఎవరైనా చిత్తూరులో మెయిన్ ఆఫీసుకెళ్ళి కనుక్కోవాలి అన్నారు' చెప్పింది సుధ.

ఆ అమ్మాయి మీద తగని జాలి వేసింది లతకు. తండ్రి లేనితనం. మేనమామ ఇంట్లో పెరుగుతున్నామనే ఒక స్పృహ. ఒక తక్కువ భావం. కొంతైనా చదువుకు ఆసరా అనుకొంటే స్కాలర్‌షిప్పు తిప్పలు పెడుతూ ఉంది. లత మీద అనంతంగా జాలి కలిగింది

'నేనే వెళ్ళాను మేడమ్. సుబ్బారావుసార్‌కు నేనే వెళ్తానని చెప్తే, అక్కడ ధనుంజయ అనే సార్ ఉంటారు కలిసి చెప్పుకో అన్నారు. నేనే నేరుగా ఆఫీసుకు వెళ్ళాను మేడమ్. అక్కడికి వెళ్ళే సరికే మధ్యాహ్నం అయ్యింది....... సార్ లేదు. వచ్చే దాకా కూచొన్నాను. సార్ వచ్చాక కలిస్తే 'ఏ స్కాలర్‌షిప్పు' అని అడిగి పేపర్లలో ఏదో చూసి ఏదో రాసుకొని వివరాలు ఉన్న స్లిప్పు ఇచ్చి వారంలో వచ్చేస్తుంది వెళ్ళమన్నారు. 'ఒకవేళ రాకపోతే సార్.....' అంటే 'ఆ స్లిప్పు మీ క్లర్కుకు ఇవ్వు. అది చాలు' అన్నారు మేడమ్. కాని మేడమ్ ఆఫీసు ఊరికి దూరంగా ఉంది. ఎవరూ తోడు లేరు చీకటవుతుంటే భలే భయమేసింది. మేడమ్......! మన సార్ వాళ్ళు భలే తిట్టారు. ఒక్కదాన్ని వెళ్ళినందుకు' గలగలా చెప్పింది. అప్పటిదాకా ఉన్న బాధ ఏమైయ్యిందో ఆ గొంతులో....

తన పని తానొక్కతే చేసుకోగలిగిన ధైర్యం ఎంత ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చిందో ఆ మాటలను బట్టే తెలిసిపోతూ ఉంది. ఆడపిల్లలకు ఈ ధైర్యం ఎంత అవసరం. సుధ ఎవరిపైనైనా ఆధారపడితే, పని అయ్యేదేమో కాని .... ఈ ధైర్యం వచ్చేది కాదు.

తన ధైర్యానికి ముచ్చటపడుతూ లత డబ్బు తీసి ఇవ్వగానే 'స్కాలర్‌షిప్పు రాగానే తెచ్చిస్తా మేడమ్......థాంక్స్ మేడమ్' చెప్తూ వెళ్ళింది.

వారం అయ్యాక వచ్చి. 'చిత్తూరు ఆఫీసువారు వారమన్నారు కాని రెండు వారాలయ్యింది మేడమ్.....' అంటూ డబ్బు తిరిగిచ్చింది.

* * *

రెండేళ్ళ తర్వాత సుధను చూడగానే సుధ నాటి పట్టుదల గుర్తొచ్చింది.

'నీ ఆరాటం, పట్టుదలే........నీ ఎదుగుదల. దానిని ఎప్పటికీ పోగొట్టుకోకు....' ఆప్యాయంగా సూచననిచ్చింది లత.

*

# ఆశాద్వీపంలో రచయితల 'వన భోజనం'

- అవధానుల మణిబాబు
9490760779



*కెరటాల ఉధృతి తగ్గాక ముందుగా మషాలా ఉప్మా, పూరి బరువును క్యారియర్ లోంచి కడుపులోకి చేరవేసాం. స్మార్ట్ ఫోన్‌ల పుణ్యమాని వీలైనన్ని సాగర దృశ్యాలని బంధించాం. కాసేపటికి మార్ని జానకిరాం చౌదరి జోక్స్ చెప్పడం మొదలెట్టడంతో అందరం వారితో జతకట్టాం. మధ్య మధ్యలో మద్దా సత్యనారాయణ ఆశువుగా పద్యాలందుకున్నారు. బృందంగా కొన్ని, పక్క వారితో చెవులు కొరుక్కుంటూ మరి కొన్ని, బోళ్ళు కబుర్లు చెప్పుకున్నాం.*

వేర్వేరు దృక్పథాలు, భావజాలాలు, సాహిత్య నేపథ్యాలు, రచనా విధానాలు గల వ్యక్తులందరినీ సమీకరించి, రెండేళ్ళపాటు అనేక సభలు, సమావేశాలు నిర్వహించి కాకినాడలో ఓ సుహృద్భావ సాహిత్య వాతావరణాన్ని రూపొందించి, కొనసాగుతున్న ఘనత 'సాహితీ స్రవంతి'ది. ఇది అద్దేపల్లి వారి మానసపుత్రిక. ఇందరం ఒకటి కావడానికి ఒకే ఒక కారణం ఆ ప్రజాకవే. వారికి అత్యంత ప్రేరణదాయకమైన విషయం సముద్రం. సాగరాన్ని తలచుకున్న ప్రతిసారీ ఉప్పొంగిపోయేవారు. "బందరు సముద్రం ఒక తన్ను తంతే కాకినాడ సముద్రం ఒడ్డున పడ్డా"నన్న ఆయన నేలను కూడా 'ఆకుపచ్చని సజీవ సముద్రం' గానే భావించారు. సంస్థ వార్షికోత్సవ సంచికలకు కూడా "కడలి చిరునామా" "ఆశా ద్వీపం" పేర్లు పెట్టారు. అదిగో ఈ 'ఆశా ద్వీపం' గురించి విన్నప్పటి నుండి అందరికీ ఓసారి చూడాలనే ఉత్సుకత. ఎలాగైతేనే ఇన్నాళ్ళకు కన్వీనర్ గదుల నాగేశ్వరరావు (గనారా) పూనికతో 13 నవంబర్, 2016న ప్రయాణం సాధ్యమైంది.

దాట్ల దేవదానం రాజు, అద్దేపల్లి ప్రభు, మధునాపంతుల సత్యనారాయణ మూర్తి, డా।। జోస్యుల కృష్ణబాబు, డా।। వుయ్యపు హనుమంతరావు, బోల్లోజు బాబా, ఇంద్రగంటి నరసింహమూర్తి, రామకృష్ణ శ్రీవత్స, పద్మజవాణి, అద్దేపల్లి జ్యోతి, మద్దా సత్యనారాయణ, మార్ని జానకిరాం చౌదరి, మేడిశెట్టి శ్రీరాములు, కొందరి కుటుంబసభ్యులు మొత్తం 35 మంది ఉదయం తొమ్మిదింటికి 'భానుగుడి' సెంటర్లో కలుసుకున్నాం. అందరం అలా 'సాంబమూర్తి నగర్ ఫ్లై ఓవర్' మీంచి సమూహాలుగా 'ఫిషింగ్ హార్బర్' చేరాం. టూరిజం శాఖవారి బోట్ సిద్ధంగా ఉంది. నెమ్మదిగా అందులో చేరి (దూరి అనాలి), కాసేపాగి కెరటాల ఉధృతి తగ్గాక ముందుగా మషాలా ఉప్మా, పూరి బరువును క్యారియర్ లోంచి కడుపులోకి చేరవేసాం. స్మార్ట్ ఫోన్‌ల పుణ్యమాని వీలైనన్ని సాగర దృశ్యాలని బంధించాం. కాసేపటికి మార్ని జానకిరాం చౌదరి జోక్స్ చెప్పడం మొదలెట్టడంతో అందరం వారితో జతకట్టాం. మధ్య మధ్యలో మద్దా సత్యనారాయణ ఆశువుగా పద్యాలందుకున్నారు. బృందంగా కొన్ని, పక్క వారితో చెవులు కొరుక్కుంటూ మరి కొన్ని, బోళ్ళు కబుర్లు చెప్పుకున్నాం.

మధ్యమధ్యలో టూరిజం వాళ్ళ సూచనలు,

హనుమంతరావుగారి ముందు జాగ్రత్తలు. మా వాళ్ళు పడవ నడుపుతున్న భంగిమల్లో ఫోటోలు దిగుతుంటే "పురేయ్ వింజం డ్రైవర్ నన్ను రైలు తోలనిస్తావా నీకు ప్రొద్దీ బీడీలిస్తా" నన్న బుడుగు జ్ఞాపకమొచ్చాడు. పదకొండున్నరకి ఆవలి బడ్డుకి చేరాం. తగిన లోతు లేకపోవడంతో స్టీమరులోంచి దిగి మరో పడవలోకి మార్చాల్సి వచ్చింది. తినాల్సిన పదార్థాలు దింపేటప్పటికి తాతలు దిగొచ్చారు. పడవ కూడా ముందుకు జరగదనడంతో మూడు అడుగుల లోతులో కాస్త దూరం, బురదలో ఇంకాస్త, డొంకలలో మరికొంత నడిచి నిర్దేశిత ప్రదేశానికి చేరుకున్నాం. చుట్టూ సర్వీ చెట్లు. శ్రద్ధగా పనిగట్టుకు పెంచినట్టు పైన కప్పుగా ఏర్పడి కింద చదునుగా ఎంత అనువుగా ఉందో. బరువులు దింపుకుని దుప్పట్లు పరుచుకుని, కొందరు కూర్చుని, ఇంకొందరు సాగిలపడి సేద తీరారు. నెమ్మదిగా మైక్ అందుకొని రిడిల్స్ అడిగి చిన్న చిన్న బహుమతులిస్తూ ఉత్సాహపరిచే ప్రయత్నం చేశారు జానకి రాంచౌదరి. మద్దావారు ఓ ప్రహేళికా పద్యం, ఆశువుగా మరికొన్ని పద్యాలు, పొడుపుకథలు సంధించారు. అందులో ఒకటి:

*పాలనిచ్చుగాని పసరంబు గాదది*
*పండ్లు చెవులు గల్గు పక్షి యద్ది,*
*పగలు నిదుర వోయి పయనించు నిశయందు*
*నడువలేదు, ఎగిరి వెడలనెద్ది* – ఎవరో 'గబ్బిలం' అని గట్టిగా చెప్పడం, చప్పట్లు. మరికొన్ని జోకులు కొనసాగింపుగా నవ్వులు, తనవంతు రావడంతో నెమ్మదిగా కృష్ణబాబు మొదలుపెట్టారు.

***అల్లము కారముండదిల ;నాశకునంతము కద్దు ; చీకటిన్ బిల్లికి చూపులేదు; వరిబియ్యము ప్రాకులయందు తియ్యనౌ బెల్లము చేదుమానదల; వేము సుధానిధి; చందమామ బల్ నల్లగనుండు; కోకిల వనంబుల నుండు కిరాత జాతియే***

కొందరు అర్థమై ఆనందించాం. పద్మజావాణి, అద్దేపల్లి జ్యోతి, జానకిరాం చౌదరి, గడల శివ ప్రసాద్ చక్కని కవితలు వినిపించారు. మేడిశెట్టి రాములు చదివిన పేరడీ న్యూస్ మొత్తం కార్యక్రమంలో హైలెట్. తరువాత దేవదానం రాజు ముందు రోజు రాత్రి వ్రాసిన తాజా కవిత "ఒక పగిలిన కల" వినిపించారు. "సౌకర్యాల లేపనం రాసుకున్న వంటికి చెమటచుక్క బరువైన వాడిని; నేలను గజాలుగా కొలతలు వేసుకుంటూ మట్టిని కనకపు రాసులుగా పోగేసిన వాడిని; ఈ రాత్రి నన్నెలా నిద్ర పుచ్చుతుంది?" demonitization అనంతర పరిణామాలను ఇంత భావగర్భితంగా కవిత్వీకరించడంలో దాట్ల వారి చేయితిరిగిన తనం కనిపించింది.

తరువాత, బొల్లోజు బాబా Wadih saadeh వ్రాసిన Migration కవితకు తన అనువాదం "వలస పోవటం" (translated from Arabic by Anne Fairbairn) వినిపించారు. వాతావరణం ఒక్కసారిగా అర్ద్రమయమైంది. ముఖ్యంగా "వారి పాదముద్రల్ని స్పర్శించే ఒకే ఒక దయామయి కాలిబాట ఆ తరువాతెప్పుడూ వారిని చూడలేదు ఎంత ప్రయత్నించినా. ఒక వీధికుక్క ప్రతీ సాయంత్రమూ వచ్చి వారి ఇంటి ముందు అరుస్తూండేదని ఆ వూరిలోనే ఉండిపోయిన కొంతమంది చాలా కాలం చెప్పుకొన్నారు" ఈ పాదాలు అందరినీ కదిలించాయ్. వీటన్నింటికీ మధునాపంతుల ప్రయోక్తగా వ్యవహరిస్తూ సందర్భానుసారంగా ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్లో అంశాలను, వారి అనుభవాల్ని పంచుకున్నారు.

పరిసరాలను, ప్రసంగాలను ఎంత ఆనందిస్తూన్నా అందరిలో పదేపదే కనిపించిన లోటు అద్దేపల్లి. ప్రయాణంలో చాలాసార్లు "చేతిలో ఒక చెక్క పట్టుకుని కొందరు తమకంటే నాలుగు రెట్లు పెద్దవైన కెరటాల మీద షికారు చేస్తుంటే బీచ్ నుంచి చూసేవాళ్లకి సముద్రపు రోమాచాల్లా కనిపిస్తారు" వాక్యం వెంటాడింది.

తరువాత అసలు విందులో కేరట్ హల్వా ఆకర్షణ అయింది. అకస్మాత్తుగా రామకృష్ణ శ్రీవత్స కనపడలేదు. కాసేపు సిగ్నల్ లేక ఆయన ఫోన్ పలకలేదు. భోజనాలయ్యేనరికి వచ్చి అలా ఊరు, సముద్రం చూసొచ్చానన్నారు. ఊరికే చూసి రావడం కాదు అక్కడ పిల్లలను (ఆశాద్వీపపు రేపటి ఆశాదీపాలన్నారాయన) పలకరించి వచ్చారు. "నడక కడలి వరకే" దీర్ఘకవితలో శ్రీవత్స అంటారు– "ఆకాశంలానే సముద్రానికీ భాష ఉంది. సముద్ర ఘోష అర్థం కావాలంటే మౌనంగా ఉండాలి" ఆ మౌనమే అతనికి "కనుచూపు మేరా విస్తరించి కదలికలున్న ఆకాశం సముద్రం" అనే తత్వాన్ని బోధపరిచింది. మురళీ కుమార్ కూడా అక్కడ నివాసం ఉంటున్న కుటుంబాలను కలసి బాగోగులు తెలుసుకొని వచ్చారు.

మరలా కాసేపు అంత్యాక్షరి. పడవ వాళ్ళు తొందర

## ప్రముఖ రచయిత మానేపల్లి కన్నుమూత



04.05.1944 - 21.01.2017

ప్రముఖ కవి, రచయిత, అభ్యుదయవాది మానేపల్లి సత్యనారాయణ (72) జనవరి 25న కన్నుమూశారు. మానేపల్లికి భార్య నళిని, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. శ్రీకాకుళంలో ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాలలో రీడర్‌గా 2002లో పదవీ విరమణ చేశారు. యలమంచిలిలో 'అవగాహన' పేరుతో ఆధునిక ఆలోచనా వీచిక అనే సాహిత్య ఉద్యమ సంస్థను స్థాపించి అక్కడే స్థిరపడ్డారు. శ్రీశ్రీ, రోణంకి అప్పలస్వామి, ఆరుద్ర వంటి ప్రముఖ అభ్యుదయ కవులతో ఆయనకు సన్నిహిత సంబంధాలుండేవి. 'ఆడవాళ్లు పుట్టరు' 'రాజీ', 'మట్టివాసన', 'ఆక్రమణ', 'అమ్మమ్మ ఫొటో', 'కర్ఫ్యూ'అనే కథా సంపుటాలు, 'కలలు నేలమీదకి', యోధుడా, కౌగలించుకోనీ, 'విశాఖపట్నం' వంటి కవితా సంపుటాలు ప్రచురించారు. యలమంచిలిలోని ఇంటిని 'అవగాహన' పేరిట గ్రంథాలయంగా తీర్చిదిద్దారు. అవగాహన గ్రంథాలయానికి క్రమంగా తప్పకుండా సాహిత్య ప్రస్థానం పత్రికను తెప్పించేవారు. ఆయన రచనలు ప్రస్థానం పత్రికకు తరచూ పంపించేవారు. చివరికంటా సామాజిక అభ్యున్నతికి, ప్రగతిశీల ఉద్యమాలతో వెన్నంటి నిలిచారు. మానేపల్లికి సాహిత్య ప్రస్థానం తరపున జోహార్లర్పిస్తున్నాం. ❋

పెట్టడంతో ఈ లోకంలోకి వచ్చి మెల్లగా సర్దుకుని అడుగులో అడుగు వేసుకుంటూ బయలుదేరాం. ఈ సారి లోతు పెరగడంతో జట్టీ ఎక్కి అందులోంచి పడవలోకి దిగాలి. వచ్చేటప్పుడు పెద్ద పడవ లోంచి చిన్న పడవలోకి రావాలన్నపుడు ఇపుడు జట్టీ లోంచి పడవ లోకి దిగేప్పుడు "బారిష్టర్ పార్వతీశం" లో చిన్న స్టీమర్లోంచి పెద్ద స్టీమర్ లోకి మారేప్పుడు పార్వతీశం పొందిన ఆందోళన, మొక్కపాటి వారు ఆ సన్నివేశాన్ని నడిపించిన తీరు గుర్తొచ్చి నవ్వొచ్చింది. ఇంత సాంకేతిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో ఈ చిన్ని ప్రయాణానికి మనం భయపడుతుంటే వందేళ్ళ క్రితం సృష్టింపబడ్డ పాత్ర స్వభావాన్ని అంత సహజంగా చిత్రించిన రచయిత ప్రతిభ ఎంత గొప్పదో అనిపించింది.

తిరుగు ప్రయాణంలో మరిన్ని ఆసక్తికర చర్చలు, కవిత్వానువాదం, అనువాద కవిత్వంపై చాలా సేపు బాబా, ప్రభు మాట్లాడుకున్నారు. Wadih saadeh వ్రాసిన Night Visit కవితకు బాబా అనువాదం "రాత్రి ఆపద" (translated from Arabic by Anne Fairbairn) గురించి ప్రధాన చర్చ. 'సాయుధుడు, సైనికుడు' పదాల ప్రయోగంలో ఎంత తేడా ఉందనేది ముఖ్యాంశం. తినేవేవో పంచుతూ కాస్త బిజీ అయ్యాను గానీ లేకపోతే నేనూ మాట కలిపే వాడినే. దూరంగా దగ్గరగా కనిపించే ఓడల గురించి చూసిన సినిమాలతో పోల్చుకుంటూ పిల్లలు గడిపేశారు.

అయితే ఓ సాధారణ పర్యాటకునిలా అన్నీ పరిశీలిస్తూ గడిపిన ప్రభు ఏమీ మాట్లాడక పోయినా ఎపుడో ఆయన వ్రాసిన వాక్యాలు నాకు పదే పదే గుర్తొచ్చాయి. "వాళ్ళు వలలేసి సముద్రాన్ని బయటకు లాగేస్తారా?" "సముద్రపు నీళ్ళలో నాని నాని ఊళ్ళన్నీ అదో రకం బతుకు వాసనేస్తాయి" - ఎంత గొప్ప వాక్యాలో కదా! ఇది సమీక్షా వ్యాసం అయుంటే పై వాక్యాల గురించి ఎంత రాస్తే తనివి తీరుతుంది.

మొత్తానికి గంట ప్రయాణం తరువాత బడ్డుకు చేరుకున్నాం. సముద్రంతోనూ, పల్లెకారుల జీవితంతోనూ దశాబ్దాల అనుభావం గల గ.నా.రా. మాత్రం మౌనంగా వెనకుండి కార్యక్రమాన్ని నిర్వహించారు. అయినా గ.నా.రా. కు ఎంత తెలుసో 'కడలి కల్లోలం' నవల చదివిన వారికి ప్రత్యేకంగా చెప్పక్కర లేదు కదా!

మా బృందంలో అతిచిన్న వయసు 12, అతిపెద్ద వయసు 75. ఇంతమందికి ఎంతో కొంత మోతాదులో ఆహ్లాదాన్ని, మధురానుభూతినీ పంచే ఉమ్మడి అంశాలు ఏమి ఉంటాయి? ఆలోచిస్తే రెండే అనిపించాయి. సాహిత్యం, సాగరం, కుల భోజనాలుగానే, ఇతరత్రా వ్యాపకాల కోసమో చిరునామాలుగా మారుతున్న కార్తీక సమారాధనలు ఇకపై ఒకే వ్యాసంగం పట్ల ఆసక్తి గల సమూహాలుగా నిర్వహింపబడితే భావ వినిమయం సాధ్యమై ఆ విహారం విజ్ఞాన దాయకం అవుతుందని ఆ దిశలో సాహితీ స్రవంతి ఈ ఏడే తొలి అడుగేసిందని తెలియజేస్తూ సెలవ్. ❋

# కళాత్మకత

- పిల్లా కుమారస్వామి
7989749969



ఆ రోజు ఆదివారమైనందునేమో రోడ్డుమీద జనం పలుచగా ఉన్నారు. వాహనాల రద్దీ కూడా పెద్దగాలేదు. నేను నా మిత్రుడు జగదీష్ ఉదయాన్నే దగ్గర్లో ఉన్న రైత్వా క్యాంటీన్‌లో టీ సేవిద్దామని గది నుంచి బయటకు వచ్చాము.

అప్పటికే వేసవి కావడం వల్ల సూర్యుడు తన తాపాన్ని ప్రదర్శించడం మొదలు పెట్టాడు. మా గది నుంచి రైత్వా క్యాంటీన్ ఫర్లాంగు దూరంలో ఉంటుంది. గదికి తాళం వేసి బయటకు వస్తుండగా దూరంగా ఆకాశంలో మబ్బులపై పడ్డ సూర్యకాంతి శ్వేత వర్ణంతో మెరిసిపోతుంది. మా గదికి ఎదురుగా రోడ్డుకు ఆవలివైపున ఏపుగా పెరిగిన కొబ్బరి చెట్టుపై సూర్యకాంతి ప్రతిఫలించి ఆకు పచ్చదనాన్ని శోభాయమానం చేస్తోంది. జగదీష్ మంచి భావుకుడు పైగా కళా ప్రియుడు. వీటిని చూడగానే జగదీష్‌లోని భావుకత ఉప్పొంగి కవిత్వం చెప్పడం మొదలుపెట్టాడు.

"అల్లనల్లన కుచ్చిళ్ళు ఎత్తిపట్టి
సూర్యకాంతిలో నడచివచ్చే నానెచ్చెలీ
నాహృదయాన్ని పరచినాను నీ పాదాలచెంత"
అంటూ అశువుగా నాకు వినిపించాడు.

'అబ్బా! జగ్గూ! భలే వుందోయ్ నీ ప్రేమ కవిత!
నీలో మంచి భావుకత వుంది' అంటూ పొగిడాను
కొబ్బరాకుపై రాలిన చినుకుపై బడ్డ కాంతిలా
నీ బుగ్గలపై మెరిసిన దరహాసం
నా హృదయంలో రేపుతోంది ప్రేమకాసారం"
అంటూ మళ్ళీ తన కవితను పొడిగించాడు జగదీష్.

'వారెవ్వా! వన్స్‌మోర్' అంటూ జగదీష్ భుజాలను తట్టాను మెచ్చుకోలుగా.

జగదీష్ ఆనందంగా చుట్టూచూస్తూ తన కవిత్వానికి పదును పెడుతున్నాడు.

సగం దూరం వచ్చేసరికి రోడ్డు ప్రక్కన ఒక బిచ్చగాడు ఏసుక్రీస్తు బొమ్మను చాక్‌పీసుతో చిత్రిస్తున్నాడు.

ఆ బొమ్మను అతను చిత్రించే తీరును చూస్తూ జగదీష్ నిలబడి పోయాడు. నేను ఆసక్తిగా ఆ బిచ్చగాన్ని గమనించాను. క్రీస్తులా అతను బక్క చిక్కి ఉన్నాడు. ఆ బొమ్మ చూసిన జనాలు వేసే డబ్బుల్తో జీవనం సాగించే మనిషిలా కనిపిస్తున్నాడు. అతనిలో ఉండే చిత్రకారున్ని ఎవరైనా తట్టి లేపితే అద్భుత

# స్వేచ్ఛ

- బైరి ఇందిర
9849173560



భావ ప్రకటనా స్వేచ్ఛ
విహంగంలా ఎల్లలు లేనిది
స్వేచ్ఛ చెల్లుబాటైన చోటనే
సృజన రెక్క విప్పుతుంది !
వేల ఆలోచన్లు సంఘర్షిస్తేనే
మేధ పరిమళిస్తుంది !
భిన్నత్వం సమున్నతమై
భాసిస్తుంది !
వైవిధ్యం వర్ధిల్లుతుంది !!
ఏకవర్ణంలో
ఇంద్రధనుసునూహించలేము

ఊహలకు సంకెళ్లు వేసి
నాగరికతను నడిపించలేము !
కవైనా, కళాకారుడైనా
ఎవరి వాణి వారిది
ఎవరి బాణి వారిది
స్వేచ్ఛ నోరు నొక్కేస్తే
ప్రజాస్వామ్యం అపహాస్యమౌతుంది

నైజాన్ని హైజాక్ చేయాలని చూస్తే
అది నిరంకుశుల పాలిటి
అంకుశమౌతుంది !
మేధస్సుకు హద్దులు గీస్తే
బుద్ధి ప్రతిఘటిస్తుంది !
ఒక్క గొంతు నులిమితే
ఊరు పిక్కటిల్లుతుంది !!

❋

---

చిత్రాలు వచ్చేవేమో! ఈ సమాజం ఇలాంటి వారికి చేయూత నివ్వదు కదా! "నేను డబ్బుబాగా సంపాదించాక ఇలాంటి వారిని తప్పకుండా చేరదీస్తాను" మనసులో ఆలోచనలు బాగా నాలో ముసురుకుంటున్నాయి.

నా భావతరంగాలకు అంతరాయం కలిగిస్తూ జగదీష్ "ఈ కళాకారుడు మంచి చిత్రాన్ని గీస్తున్నాడు గాని చిత్రంలో జీవకళ ఎంత మాత్రం లేదు మిత్రమా!" అని అన్నాడు. జగదీష్ మాట్లాడిన మాటలతో ఈ లోకంలోకి వచ్చాను.

"ఏమైంది? బాగా గీస్తున్నాడు కదా!" అన్నాను.

"క్రీస్తు బొమ్మ పూర్తిగా గీచినా అందులో ఎలాంటి జీవకళ లేదు"

"బిచ్చగాడు తన బతుకు తెరువు కోసం గీసే బొమ్మలో కళను కూడా చూస్తావా?"

"చూడాలి అది చూసే జనం ఎక్కువ డబ్బులు వేస్తారు"

ఇలా మాట్లాడుకుంటూ క్యాంటీన్ చేరాం.

రెండు టీలు కావాలని క్యాంటీన్ అబ్బాయితో చెప్పాం.

"ఇలాంటి కళాకారుల్ని ఆదరిస్తే బిచ్చగాళ్ళుగా ఎందుకు మారతారు? ప్రభుత్వం వీళ్ళను సరైన విధంగా ఆదరించాలి" అన్నాన్నేను. ఏదో చర్చ ప్రారంభించే వానిలాగా.

"ప్రభుత్వం ఎందుకు చేస్తుంది మిత్రమా? ఎవడి బతుకు వాడిది. కళాకారునిలో ప్రతిభ వుంటే వాడే జనంలో రాణిస్తాడు. ప్రభుత్వంతో పనేముంది" అన్నాడు జగదీష్.

ఇలాంటి చర్చలు సహజంగా నడుస్తూ ఉంటాయి మా ఇద్దరి మధ్య.

టీ త్రాగి డబ్బులు చెల్లించి క్యాంటీన్ బయటకు వచ్చాం. అది రైల్వే స్టేషనుకు దగ్గర కావడం వల్ల ఆ రోజేదో ప్రభుత్వం పోటీ పరీక్ష నిర్వహిస్తున్నందువల్ల పదైదు నిమిషాల ముందు లేని రద్దీ ఇప్పుడు ఎక్కువగా ఉంది.

వాహనాలను దాటుకుంటూ మళ్ళీ వచ్చిన దారినే వస్తున్నాం. ఖచ్చితంగా బొమ్మ గీచిన ప్రదేశం దగ్గర జనాలు గుమ్మిగూడి చూస్తున్నారు. క్రీస్తు బొమ్మను చూడడానికి అందరూ నిలుచున్నారని దగ్గరకు వెళ్లాం.

జగదీష్ బొమ్మను చూశాడు. 'అబ్బ! ఇప్పుడు ఈ క్రీస్తు బొమ్మలో జీవకళ వచ్చింది చూడు' అన్నాడు నాతో.

"నిజంగానే నా కళ్ళను నేను నమ్మలేక పోయాను. శిలువ వేసిన గుర్తుల దగ్గర రక్తం మరకలున్నాయి. శరీర మంతా గాయాలతో నిండిన మనిషిలాగా జీవకళ ఆ చిత్రంలో పుట్టిపడుతోంది"

బొమ్మ గీచిన బిచ్చగాని వైపు చూశాను. అతను విగతజీవుడై పక్కన పడివున్నాడు. ఏదో వాహనం బిచ్చగాన్ని గుద్ది పోయింది. రక్తం ఎంత చిమ్మిందో చూడండి" అంటూ న్నారెవరో.

అయ్యో పాపం! అంటున్నారు మరొకరు.

'బొమ్మ ఎంత బాగా గీశాడో' జగదీష్ లాగా చిత్రాన్ని కీర్తిస్తున్నారెవరో

'ఏది కళాత్మకత?' నా మదిలో అంతర్మథనం ప్రారంభమైంది.

❋

# తెలుగు నేలపై కన్నడ శాసనాలు -కడపజిల్లా



- ఈమని శివనాగి రెడ్డి
9848598446

కడప జిల్లాలో మునుపటి రాయచోటి తాలూకా అబ్బావరంలో పులివెందుల తాలూకాలో రామాపురం, సిద్ధవటం తాలూకాలో దొంగలసాని, ప్రొద్దుటూరు తాలూకాలో చౌడూరు, పైడాలి, రామేశ్వరం, కమాలాపురం తాలూకా కమలాపురం, చిలమకూరు, పాలగిరి, పెద్ద చప్పలి, పెద్దనపాడు, జమ్మలమడుగు తాలూకాలో కన్నెలూరు, గొల్లపల్లి, దానవులపాడు, దేవగుడి, పెద్దముడియం, కడప తాలూకాలో చిన్నమాసపల్లి, చింతలపుత్తూరు, తుమ్మలూరు, పుష్పగిరిలో కన్నడ శాసనాలున్నాయి. వీటిలో బాదామీ, చాళుక్య, రాష్ట్ర కూట, వైదుంబ, రేనాటి చోళ, కళ్యాణీ చాళుక్య, యాదవ, విజయనగర రాజులు విడుదల చేసిన 29 శాసనాలున్నాయి. దానవుల పాడులోని క్రీ.శ 915 నాటి కన్నడ శాసనాన్ని రాసిన సేనబోవ గుణశర్మ కన్నడ తొలికవి పంపని కంటే ముందు వాడనీ, అతడు హరివంశం, శూద్రక, భువనైకవీర అనే మూడు కావ్యాలు రాశాడని ఆ శాసనంలో చెప్పబడింది. కన్నడ సాహిత్య, చరిత్రకు ఈ ఆధారం ఎంతో ముఖ్యమైనది. ఇక ఇతర శాసనాలను పరిశీలిద్దాం.

దానవులపాడులోని పెన్నేరు ఒడ్డున గల బాదామీ చాళక్య రాజైన విజయా దిత్యుడు (క్రీ.శ. 696-733) శ్రీ భూపాత్యునికి కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి. జిల్లాలో రాష్ట్ర కూటరాజులైన మూడో గోవిందుడు, మూడో ఇంద్రుడు, మూడో కృష్ణుని కన్నడ శాసనాలున్నాయి. జమ్మలమడుగు తాలూకా కన్నెలూరులోని ప్రభూతవర్ష మహారాజాధిరాజు, పృథ్వీ వల్లభ (క్రీ.శ. 793-814) ని శాసనంలో రేనాడు 700 ను పాలిస్తున్న అతని సామంతుడైన రేవయరస ప్రస్తావ ఉంది. కమలాపురంలో గల క్రీ.శ. 925, డిసెంబరు 2 శుక్రవారం నాటి రాష్ట్రకూట రాజైన నిత్యవర్ష మూడో ఇంద్రు శాసనంలో, ముల్కి-500ను పల్లధీరుడనే సామంతుడ పాలిస్తున్నపుడు, వికలింతరామ, వికలింతభీమ అనే బిరుదుల పొందిన ఒక సామంతుడు, స్థానిక ముల్కంటేశ్వ దేవాలయానికి ద్వారమండపం, ఎనిమిది పరివార దేవతల ఆలయాలు నిర్మించినట్లు చెప్పబడింది. దానవులపాడులో రాష్ట్రకూట రాజైన మూడో ఇంద్రుని (క్రీ.శ. 915-917 శాసనంలో శ్రీ విజయ అనే దండనాయకునికి శాస సంరక్షకుడు అరివింగోజ, అనుపమకవి, ఆశ్రితజనకల్పవృ అనే బిరుదులు కలిగి, స్వచ్ఛందంగా 'సన్యాసన' దీక్ష స్వీకరించి మరణించాడని ఈ శాసనాన్ని శ్రీ విజయు సేనబోవ గుణవర్మ రాశాడనీ అతడు పంపని కంటే ముం తరం కవి అనీ, హరివంశ, శూద్రక, భువనైక వీర అ కావ్యాలను రాశాడని చెప్పబడింది.

కమలాపురం తాలూకాలో పాలగిరి శివాలయంలో క్రీ.శ. 1056 వ సం॥నాటి వైదుంబ రాజై కళింగత్రినేత్రభీమమహారాజు, అంతకు మునుపు రాష్ట్రకూ రాజైన అకాలవర్షకన్నర దేవుడు స్థానిక సమర్దేశ్వరునికి 8 పుట్ల భూమిని దానం చేసినట్లు తెలిపే శాసన స్థంభ పగిలిపోగా, ఆ దానాన్ని పునరుద్ధరించటమే కాక మరో 20

మరుతుర్ల భూమిని దానం చేసి, ఆలయానికి జీర్ణోద్ధరణ గావించినట్లు చెప్పబడింది. పుష్పగిరిలోని రాష్ట్రకూట రాజైన మూడోకృష్ణుని (క్రీ.శ.939-967) శాసనంలో, అతడు జిల్లాలోని జ్యోతి వద్ద గల దేవాలయానికి యాత్ర చేసి, తిరిగి వస్తూ పుష్పగిరిలో విడిది చేసి, స్థానిక నాగేశ్వర, సర్వేశ్వర దేవుళ్లకు 12 మరుతుర్ల భూమిని దానం చేసిన వివరాలున్నాయి.

**శాసనాల ద్వారా, రాజులు, రాణులు, సామంత మాండలికులు వారి బిరుదులు, భూభాగాల వివరాలు, చేసిన దానాలు, ఆలయాలు, యుద్ధాలు మొదలైన అనేక రాజకీయ, ఆధ్యాత్మిక, సామాజిక విషయాలు కూడా తెలుస్తున్నాయి.**

పుష్పగిరి చెన్నకేశవ దేవాలయ గోపురం ముందున్న క్రీ.శ. 1079వ సం॥పు వల్లూరు నుంచి పాలిస్తున్న త్రైలోక్య మల్ల మల్లి దేవరాజు (వైదుంబరాజు) మహా ప్రధాని చెన్నకేశవుని ప్రతిష్టించి, కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి. పుష్పగిరిలో వైద్యనాథ స్వామి దేవాలయ ప్రాకారం లోపల ఉన్న త్రికూటేశ్వర స్వామి దేవాలయం దగ్గరున్న యాదవ రాజు సింఘణ దేవుని మహాప్రధాని, దండనాయకుడైన నారాయణలక్ష్మీ దేవుడు, వైద్య నాథ దేవుని అంగరంగ భోగాలకు, లక్ష్మీ నిలయమనే మఠానికి, సత్రానికి కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి.

పెదముడియంలోని ముక్కుటేశ్వర స్వామి దేవాలయం వెనుకనున్న క్రీ.శ. 1124 నాటి శాసనంలో, కళ్యాణ చాళుక్య ప్రభువు త్రిభువనమల్ల దేవుడు జయంతిపురం నుంచి పాలిస్తుండగా, అతని సామంతుడు మహా మండలేశ్వర అంత్యణ చోళ మహారాజు అతని సామంతుడు మహామండలేశ్వర చిద్దణచోళమహారాజు ముదివేము గ్రామ మహాజనులకు అహోబల నరసింహ స్వామి సాక్షిగా కొంత భూమిని దానం చేసినట్లు చెప్పబడింది. ఈ శాసనాన్ని చిద్దణ చోళుని సోదరుడగు చావుండరాయడు రాయగా బమ్మోజు చెక్కాడు.

పెద్ద చప్పలిలోని క్రీ.శ. 1135 నాటి భూలోకమల్లదేవ మూడో సోమేశ్వరుడు కళ్యాణ నగరం నుంచి పాలిస్తుండగా, అతని సామంతుడు, మహామండలేశ్వర త్రైలోక్యమల్ల మల్లి దేవ మహారాజు నెల్లూరు పట్టణం నుంచి ముల్కి నాడు-300 ను పాలిస్తుండగా యువరాజు అహర మల్ల దేవుడు, చప్పలిలోని ఉత్తరేశ్వరస్వామికి స్థానిక పాశుపతాచార్య అగస్తిరావుల పండితులకు కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయి.

దేవగుడిలోని నీలకంతమ్మ దేవాలయంలోని వీరగల్లు పై నున్న క్రీ.శ 1149 వ సం॥ పు శాసనంలో చాళక్య రాజు జగదేకమల్లుడు రాజ్యం చేస్తుండగా, కటక చంద్రదండ నాయకుని బావమరిది మధువరన, 40 గుర్రాలతో కురుమతి దేశం పై దండెత్తగా, కురుమతి భీమరసుని హెగ్గడె అయిన మల్లోజు సేవకుడు బెలపెమామ అనునతుడు, యుద్ధంలో ఒక అశ్వికుని గుర్రాన్ని చంపి తానూ చనిపోయాడని చెప్పబడింది.

సిద్ధవటం తాలూకా దొంగలసాని గ్రామంలో ఆంజనేయస్వామి దేవాలయం దగ్గరున్న క్రీ.శ. 1159 నాటి శాసనంలో మహా మండలేశ్వరుడు నల్ల చిద్దణ చోళుడు నెల్లూరు పట్టణంనుంచి పాలిస్తున్నప్పుడు, రాజు జైత్రయాత్రలో నుండగా, అతని మహా ప్రధాని, సంధివిగ్రవిరేవణ హెగ్గడె, అతని సోదరులగు పోతన హెగ్గడెలు, పొత్తవిదేశ రాజులైన మల్లిదేవుడు, సోమేశ్వరదేవుడుపై దాడి చేశారని చెప్పబడింది. ఈ దాడిలో రేవణ హెగ్గడె మల్లి దేవుని తరిమి కొట్టి, సోమేశ్వర దేవుని, అతని 12 మంది సేనానులు, 1000 మంది సైనికులను చంపి, తను కూడా మరణించినట్లుగా ఉంది. ఈ విషయాన్ని రాజులకు తెలిపి, చనిపోయిన అతని సోదరునికి తనకూ పుణ్యంగా శ్రీశైలం, త్రిపురాంతకం, సిద్ధవటం, అలంపుర, ఉమామహేశ్వర దేవాలయాలల్లో అఖండదీపాలను ప్రతిష్టించాడనీ చెప్పబడింది. కన్నడ, తెలుగు, తమిళ భాషల్లో నున్న ఈ శాసనంలో సోమేశ్వరుడు, మల్లిదేవుడు, విమలాదిత్యుని కొడుకులనీ, ఈ శాసనంలో కులోత్తుంగ దేవుని కాలంలో వేయబడిందని తమిళ భాగంలో నమోదు చేయబడింది.

కడపతాలూకా చింతలపుత్తూరు ఇంద్రనాథ స్వామి దేవాలయంలోని క్రీ.శ.1182 నాటి మహామండలేశ్వర చిద్దణ దేవమహారాజు శాసనంలో, ముల్కినాటి లోనికోడూరు (రైల్వే కోడూరు) లోని కొంత భూమిని పుష్పగిరి ఇంద్రేశ్వర దేవునికి దానం చేసినట్లు చెప్పబడింది. ప్రొద్దుటూరు తాలూకాలోని చౌదూరు భీమేశ్వరాలయంలో క్రీ.శ. 1192 నాటి శాసనంలో మహామండలేశ్వర నల్లసిద్దణదేవచోళ మహారాజు, రేనాడు-70, కన్నె -300 లను వల్లూరు నుంచి పాలిస్తున్నపుడు, కంచి నుంచి కప్పాన్ని వసూలు చేశాడని చెప్పబడింది.

# మారిన చిరునామా



- శ్రీహస్త
9494051021

తూర్పు సంద్రం మీద ఉదయించిన సూర్యుడు
బందరు తీరం నుంచి కాకినాడ తీరం చేరాడు
ఆయన చిరునామా కాకినాడ అప్పుడు
ఆయనే కాకినాడకు చిరునామా ఇప్పుడు
సముద్రం ఒక్కటే అక్కడా ఇక్కడా
ఆటుపోట్లలో మాత్రమే తేడా
బిరబిరా కృష్ణమ్మ పరుగున సాగరం చేరిందక్కడ
గలగలా గోదారి కదలి కడలి చేరిందిక్కడ
అందరివాడు ఆయన అందుకే
బార్బరు షాపు నారాయణ
ఆయన కవిత్వాన్ని నెమరువేస్తాడు
సైకిల్ షాపు సూర్యారావు ఆయనను ప్రేమగా
పెద్దాపురం తన వద్దకు నడిపించుకుంటాడు
ఒకప్పుడు కవిత్వాన్ని మాత్రమే ప్రేమించినప్పుడు
నన్నయ పద్యాలని శ్రీనాథుని సీసాలని గోదావరిలో
దర్శించాడు
ఆ తరువాత జీవితాన్ని కూడా అర్థంచేసుకున్నప్పుడు
పోరాటాల్ని మోసుకుపోతున్న పరమాణు ప్రవాహాల్ని
అదే గోదావరిలో దర్శించాడు
దర్శించడమేమిటి నా అమాయకత్వం కాకపోతే
గోదావరే ఆయన ప్రతిబింబం అయినప్పుడు
కాలవ పక్క కుటుంబం చూసినప్పుడు
ఓ అస్థిపంజరం గిలగిలలాడుతున్నట్లు కనిపిస్తుంది ఆయనికి
ఆ అస్థి పంజరం నిలబడే రోజుకోసం ఎగసిపడే
కెరటాల్లోంచి
ఊపిరి పీల్చుకునే రోజు కోసం ఆ అస్థి పంజరం పంజావిప్పి
వ్యవస్థన్ని చీల్చి రక్తమాంసాలు నింపుకునే రోజు కోసం
ఆయన తపించాడు సామాజిక చైతన్యంకోసం రచించాడు
అందుకే అద్దేపల్లి ప్రజాకవయ్యాడు
అందరి నాల్కల మీద జీవించివున్నాడు
చిరునామా మార్చుకున్నది ఆయన కోసం కాదు
మనందరికి చిరునామా యివ్వడం కోసమే

❋

---

విజయనగర రాజులైన బుక్క రాయలు కృష్ణదేవరాయలు విడుదల చేసిన కొన్ని కన్నడ శాసనాలు కడపజిల్లాలో ఉన్నాయి. పులివెందుల తాలూకాలోని రామాపురంలో కామన ముదలనికి వెళ్లేదారిలో క్రీ.శ. 1350 నాటి వీర బుక్క రాయలి శాసనంలో, అతడు పులివజెయు పట్టణం నుంచి పాలిస్తున్నాడనీ, అతనికి మహా మండలేశ్వర, అరి రాయవిభాళ, బాసతపుల వర రాయరగండ, పూర్వ పశ్చిమ సముద్రాధిపతి అనే బిరుదులున్నాయని, అనంత రాహుతరాయ బిరుదాంకితుడైన రాయదేవ రాయులు కామ సముద్రం గ్రామంలో కొన్ని వృత్తులనిచ్చాడనీ, ఈ శాసనస్థంభం వాటికి సీమ (హచ్చు) గా నిలుస్తుందని పేర్కొనబడింది. కడప తాలూక చిన్న మాసపల్లిలోని ఆంజనేయ స్వామి దేవాలయం ముందున్న క్రీ.శ.1514 నాటి శ్రీకృష్ణదేవరాయుని శాసనంలో ముల్కినాడు సీమలో భాగమైన చెన్నూరు సీమలోని చినమాంచుపల్లి గ్రామాన్ని పుష్పగిరిలోని చెన్నకేశవ దేవుని పూజ పునస్కారం, అమృతపడి, నైవేద్యమునకు సమర్పించినట్లు చెప్పబడింది.

పుష్పగిరిలోని చెన్నకేశవ స్వామి దేవాలయ అ[illegible] మండపంలోని ఒక స్థంభంపైన కూడా ఇదే శాసనం చెకి[illegible] ఉండటం గమనించదగ్గ అంశం. కడపజిల్లా కన్నడ శాసనా[illegible] అధ్యయనం ద్వారా, క్రీ.శ. 7-8 శతాబ్దాల్లో కడప ప్రాంత[illegible] బాదామీ చాళుక్యుల ఆధీనంలోనూ అటు తరువాత క్రీ.శ.1[illegible] శతాబ్దంలో రాష్ట్ర కూటుల వశమైనట్లు తెలుస్తుంది. క్రీ.శ.11 12 శతాబ్దాల్లో ఈ ప్రాంతం కళ్యాణచాళ్యులు, తెలుగు చో[illegible]ల ఆధీనంలోనూ, అటు తరువాత 14-16 శతాబ్దా[illegible] విజయనగర సామ్రాజ్యాంతర్భాగమైనట్లు శాసనా[illegible] తెలియజేస్తున్నాయి. శాసనాల ద్వారా, రాజులు, రాణు[illegible] సామంత మాండలికులు వారి బిరుదులు, భూభాగా[illegible] వివరాలు, చేసిన దానాలు, ఆలయాలు, యుద్ధాలు మొదలై[illegible] అనేక రాజకీయ, ఆధ్యాత్మిక, సామాజిక విషయాలు కూడ[illegible] తెలుస్తున్నాయి.

❋



# సృజనను పెంచే సైన్స్ ఫిక్షన్

- ఎస్. వెంకట్రావు
9490099333

*ఫ్రాంక్ బామ్ మాటల్ని ఒక్క సారి మన బాల్య జీవితాలకు మళ్లించండి. చిన్నప్పుడు అమ్మమ్మ, నాన్నమ్మ, తాతయ్యలు చెప్పిన కథలు మనలో ఎన్నెన్ని ఊహలను రేకెత్తించాయి! రెక్కల గుర్రం మీద ఆకాశంలో విహరించే రాజకుమారుడు, కొండలు గుట్టలు, నదులు, సముద్రాలు దాటుకుంటూ పోయే కీలుగుర్రం, చంద్రుడి మీద చెట్టు, చెట్టుకింద కూర్చున్న పేదరాసి పెద్దమ్మ...ఇలాంటి కథలన్నీ బాల్యంలోని ఊహాశక్తికి పదును పెడతాయి.*

మనిషిని జంతువు నుండి వేరుచేసే ప్రధాన లక్షణం ఊహాశక్తి. జంతువు ఆలోచనలో నిన్న లేదు కాబట్టి రేపు కూడా ఉండదు. దానికి ఉన్నది అప్పుడు, అక్కడ మాత్రమే. కానీ మనిషి ఊహా శక్తి అతణ్ణి నేటి నుండి విడగొట్టింది. అందుకే అతను నిన్నటి గురించి ఆలోచించగలడు, రేపటి గురించి ఊహించగలడు. ఈ ఊహాశక్తే ఆది మానవుడు ఆధునిక మానవునిగా మెట్టుమెట్టూ ఎదగడానికి దోహదపడింది.

ప్రముఖ అమెరికన్ పిల్లల రచయిత ఎల్. ఫ్రాంక్ బామ్ ఇలా పేర్కొన్నాడు: “ఊహాశక్తి మానవుని అనాగరిక కాలం నుండి నేటి నాగరిక యుగానికి తీసుకువచ్చింది. ఊహాశక్తి వల్లే కొలంబస్ అమెరికాను కనుగొన్నాడు. ఊహాశక్తి వల్లే ఫ్రాంక్లిన్ విద్యుత్తును కనుగొన్నాడు. ఊహాశక్తే మనకు స్టీమ్ ఇంజిన్ ఇచ్చింది, టెలిఫోన్ ఇచ్చింది, యంత్రాలను, మోటారు వాహనాలనూ ఇచ్చింది. ఈ వస్తువుల గురించి మనిషి తొలుత ఊహించుకున్నాడు తరువాత అవి వాస్తవంగా మారాయి. అందువల్ల కలలు - అవి పగటి కలలే కావొచ్చు, కళ్లు తెరుచుకుని ఉండగానే మెదడు ఆలోచనలకు పదునుపెట్టే ఈ కలలే ప్రపంచం మరింత మెరుగ్గా మారడానికి కారణమయ్యాయి. ఊహాలోకంలో విహరించే నేటి పిల్లలే ఊహాశక్తి గల రేపటి స్త్రీ-పురుషులవుతారు. ఇటువంటి వారే కొత్త ఆవిష్కరణలు చేస్తారు, అందువల్ల నాగరికతను ముందుకు తీసుకుపోతారు”

ఫ్రాంక్ బామ్ మాటల్ని ఒక్క సారి మన బాల్య జీవితాలకు మళ్లించండి. చిన్నప్పుడు అమ్మమ్మ, నాన్నమ్మ, తాతయ్యలు చెప్పిన కథలు మనలో ఎన్నెన్ని ఊహలను రేకెత్తించాయి! రెక్కల గుర్రం మీద ఆకాశంలో విహరించే రాజకుమారుడు, కొండలు గుట్టలు, నదులు, సముద్రాలు దాటుకుంటూ పోయే కీలుగుర్రం, చంద్రుడి మీద చెట్టు, చెట్టుకింద కూర్చున్న పేదరాసి పెద్దమ్మ...ఇలాంటి కథలన్నీ బాల్యంలోని ఊహాశక్తికి పదునుపెడతాయి. ఆ మాటకొస్తే మన పురాణాలు నాటి మానవుని సృజన శక్తికి తార్కాణాలు. గాలిలోకి ఎగిరిపోవాలనుకున్నాడు. పుష్పక విమానం ‘సృష్టించాడు’. ఆహారం సమృద్ధిగా ఇచ్చే వృక్షాలు కావాలి, పశువులు కావలసినన్ని పాలు ఇవ్వాలి...కామధేనువు, కల్పవృక్షం ‘సృష్టించు’కున్నాడు. నాటి మానవుని ఊహలను నేటి మానవుడు నిజం చేశాడు. అందువల్ల వాస్తవాభివృద్ధికి ముందు ఊహ నడుస్తుంటుంది.

సైన్స్ ఫిక్షన్‌లు (సైన్సు నవలలు, కథలు) అటువంటి ఊహాశక్తికి పదునుపెట్టే గొప్ప సాహిత్య ప్రక్రియలు. కథలు చెప్పడం మనకు పురాతన కాలం నుండీ ఉంది. పురాణాలన్నీ

దాదాపు ఇటువంటి కథలే. ఆ కథల్లో ఆధునిక ఆవిష్కరణలకు సంబంధించిన అనేక ఊహలు కూడా ఉన్నాయి. అయితే వీటన్నిటినీ సైన్స్ ఫిక్షన్ అనలేము. అవి పురాణ గాథలు మాత్రమే. సైన్స్ ఫిక్షన్‌కు ఒక నిర్దిష్టమైన నిర్వచనం ఉంది. సైన్స్ ఫిక్షన్ అనేది ఆధునిక భావన. ఆధునిక సైన్సు అభివృద్ధి చెందుతున్న తరుణంలో వచ్చిన భావన. సైన్సు అభివృద్ధిని ముందుగానే ఊహించి చెప్పే భావన. అందుకే దీన్ని "ఆలోచనల సాహిత్యం" (లిటరేచర్ ఆఫ్ ఐడియాస్) అంటున్నారు. రేపటి సైన్సు–టెక్నాలజీ అభివృద్ధి గురించిన అంశాలను తీసుకుని కథ రాయడం, అంతరిక్ష యాత్రలు, ఇతర గ్రహాలు, సమాంతర విశ్వాల గురించి, గ్రహాంతర జీవుల గురించి, జంతువుల, మానవుల క్లోనింగ్ గురించి కథలు రాయడం సైన్స్ ఫిక్షన్. అంటే ఈ కథల్లో కేవలం ఊహ మాత్రమే ఉండదు. సైన్సు–టెక్నాలజీ విషయాలుంటాయి, శాస్త్రీయ సిద్ధాంతాలుంటాయి. మాయలు, మంత్రాలు కాకుండా ప్రస్తుత సిద్ధాంతాల మీద కొత్త సిద్ధాంతాలు, ప్రస్తుత టెక్నాలజీమీద కొత్త టెక్నాలజీ సృష్టించడం సైన్సు ఫిక్షన్‌లో ప్రధాన అంశం. అందువల్ల సైన్సు ఫిక్షన్ రచయితలకు సైన్సు గురించి తెలిసి ఉండాలి. సైన్సు ఫిక్షన్ చదువుతున్నామంటే మనం సైన్సు గురించి తెలుసుకుంటున్నామన్న మాటే. అంటే ఇతర సృజనాత్మక రచనలు భావోద్వేగాలపై పనిచేస్తే సైన్స్ ఫిక్షన్ భావోద్వేగాలమీదనే కాకుండా మన మెదడు మీద కూడా పనిచేస్తాయి. సైన్సు ఫిక్షన్ అన్న మాటను మొట్టమొదటి సారి ఉపయోగించిన వాడు హ్యూగో గెర్న్స్ బాక్. లక్సెంబర్గ్‌లో పుట్టి అమెరికాలో స్థిరపడిన ఈయన మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ పత్రిక స్థాపించాడు. అందుకే ఈయనను సైన్స్ ఫిక్షన్ ఆద్యుల్లో ఒకరుగా పేర్కొంటారు. "సైన్స్ ఫిక్షన్ అంటే నా ఉద్దేశంలో జూల్స్ వెర్న్, హెచ్‌జి వెల్స్, ఎడ్గార్ అల్లన్ పోయ్ వంటి వారు రాసిన కథలన్నమాట. అవి శాస్త్రీయ వాస్తవాలతోనూ, భవిష్యత్ గురించిన అంచనాలతోనూ మిళితమైన అందమైన భావావేశాలు" అని గెర్న్స్ బాక్ పేర్కొన్నారు.

> ***సైన్స్ ఫిక్షన్ అంటే: 'వాస్తవ ప్రపంచపు గతం, వర్తమానాలకు సంబంధించిన సరిపడా విజ్ఞానంపై ఆధారపడి భవిష్యత్‌లో జరగబోయే దాన్ని గురించి వాస్తవికతతో కూడిన ఊహాగానం చేయడం.***

వాస్తవానికి సైన్స్ ఫిక్షన్ అంటే ఏమిటి అన్నదానికి చాలా నిర్వచనాలున్నాయి. ఎందుకంటే సైన్స్ ఫిక్షన్ రచనల్లోనే చాలా రకాలున్నాయి. హెచ్‌జి వెల్స్, జూల్స్ వెర్న్ లాంటివారు రాసిన సైన్స్ ఫిక్షన్‌లలో సైన్సు ప్రధానంగా ఉంటుంది. కానీ ఫాంటసీని ఎక్కువగా చొప్పించి రాసిన రచనలు కూడా చాలా ఉన్నాయి. కాబట్టి ఇవన్నీ ఒకే నిర్వచనంలో ఒదగడం కష్టం. అయితే ఉన్నంతలో... సైన్స్ ఫిక్షన్ రచయిత రోబెర్ట్ ఎ. హీన్‌లీన్ నిర్వచనం దాదాపు అన్ని రకాల సైన్స్ ఫిక్షన్‌లకు సరిపోతుంది. ఆయన నిర్వచనం ప్రకారం సైన్స్ ఫిక్షన్ అంటే: 'వాస్తవ ప్రపంచపు గతం, వర్తమానాలకు సంబంధించిన సరిపడా విజ్ఞానంపై ఆధారపడి భవిష్యత్‌లో జరగబోయే దాన్ని గురించి వాస్తవికతతో కూడిన ఊహాగానం చేయడం. ప్రకృతి గురించిన సరైన అవగాహనతో, శాస్త్రీయ పద్ధతి ప్రాముఖ్యతను దృష్టిలో పెట్టుకుని ఈ ఊహాగానం చేయాలి'. **(realistic speculation about possible future events, based solidly on adequate knowledge of the real world, past and present, and on a thorough understanding of the nature and significance of the scientific method).** కానీ సైన్స్ ఫిక్షన్ రచనలన్నీ ఈ నిర్వచనానికి అనుగుణంగా జరగడం లేదు. సైన్సు కన్నా నాన్‌సైన్స్ (నాన్ సెన్స్ కూడా) ఎక్కువగా ఉంటున్న వాటిని కూడా తరచూ సైన్స్ ఫిక్షన్‌గా పరిగణిస్తున్నారు.

**మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ రచయిత జొహెన్నస్ కెప్లర్**

ప్రఖ్యాత శాస్త్రవేత్త, గ్రహగతుల సూత్రాలు (లాస్ ఆఫ్ ప్లానెటరీ మోషన్) కనిపెట్టిన జొహెన్నస్ కెప్లర్ మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ రచయిత అంటే మనకు ఆశ్చర్యం వేస్తుంది. 1608లో ఆయన రాసిన సోమ్నియమ్ (కల) అనే నవల మనకు తెలిసిన మొదటి సైన్స్ ఫిక్షన్ రచన. అయితే ఈ నవలను కెప్లర్ మరణానంతరం (1630) ఆయన కుమారుడు లుడ్విగ్ కెప్లర్ 1634లో ప్రచురించాడు. అప్పటివరకు ఆయన ఇటువంటి రచన చేశాడనే విషయం ఎవరికీ తెలియదు. **నవలోని అంశం:** కెప్లర్ ఒక పుస్తకం చదువుతూ నిద్రలోకి జారుకున్నప్పుడు ఆయనకు ఒక కల వస్తుంది. ఆ కలలో ఐర్లాండ్‌కు చెందిన బాలునికి, అతని తల్లికీ ఒక భూతం ప్రత్యక్షమై లెవానియా (మన చందమామ) అనే ఒక ద్వీపం గురించి చెబుతుంది. ఈ నవలలో కెప్లర్ చంద్రుని మీద నుండి

చూస్తే భూమి ఎలా కనిపిస్తుందో చెప్పాడు. భూమికి ఉపగ్రహమైన చందమామ "భూమి నుండి 50,000 మైళ్ల దూరంలో ఈథర్ అనే మాధ్యమంలో ఉంటుంది" అని భూతం చెబుతుంది. భూమి నుండి లెవానియాకు వెళ్లడానికి ఒకే ఒక తోవ ఉంటుంది. ఈ మార్గం తెరిచి ఉంటే భూతాలు నాలుగు గంటల్లో మనుషులను చందమామ వద్దకు చేర్చగలరు. అయితే మనుషులు ఈ ప్రయాణపు షాక్‌ను తట్టుకోలేరు కాబట్టి వారికి మత్తు మందు ఇచ్చి తీసుకు వెళతారు. మార్గం మధ్యలో విపరీతమైన చలి పెద్ద సమస్య. అయితే భూతాలు వాటి శక్తులతో చలిని పారదోలుతాయి. అలాగే ఊపిరి అందడంకోసం ముక్కు రంధ్రాల దగ్గర స్పాంజిలు ఉంచుతారు. భూతాలు మహా శక్తితో ఒక్క తోపు తోయడం వల్ల మనుషులు వేగంగా చంద్రుని చేరుకుంటారు. చంద్రుని సమీపించినప్పుడు మనుషుల వేగాన్ని భూతాలు తగ్గిస్తాయి. అందువల్ల వారు చంద్రునిపై నెమ్మదిగా దిగుతారు. ఖగోళ శాస్త్రం అంతగా అభివృద్ధి చెందని ఆ కాలంలోనే కెప్లర్ ఊహాశక్తి చంద్రుని మీద నుండి చూస్తే భూమి ఎలా ఉంటుందో వర్ణించింది. చంద్రుని చేరుకునే విధానం గురించి చెప్పింది. కెప్లర్ రాసిన ఈ సోమ్నియం నవలను చంద్రుని గురించి సీరియస్‌గా రాసిన మొట్టమొదటి శాస్త్రీయ గ్రంథంగా పేర్కొంటారు.

**నవలతోపాటే సైన్స్ ఫిక్షన్ అభివృద్ధి**

18వ శతాబ్దపు పారిశ్రామిక విప్లవం 'నవల'కు నాంది పలికింది. ఇంగ్లండ్, యూరప్‌లో నవలతో పాటే సైన్స్ ఫిక్షన్ కూడా అభివృద్ధి చెందింది. 19వ శతాబ్దం ప్రారంభంలో బ్రిటిష్ రచయిత్రి మేరీ షెల్లీ రచించిన 'ఫ్రాంకెన్‌స్టీన్' (1818) తొలి సైన్స్ ఫిక్షన్ అని కొందరు పేర్కొంటారు. విక్టర్ ఫ్రాంకెన్‌స్టీన్ అనే యువకుడు చేసిన ఒక శాస్త్ర ప్రయోగంలో వికృతమైన శరీర నిర్మాణం గల వింత మనిషి తయారవడం, అతను ఎదురు తిరిగి సృష్టించిన శాస్త్రవేత్తనే నాశనం చేయడం గురించి ఈ నవల చెబుతుంది. షెల్లీ 18 ఏళ్ల వయసులో ఈ నవల రాసింది. ఫ్రాంకెన్‌స్టీన్ అనేది ఆంగ్ల వాఙ్మయంలో ఒక నిర్దిష్ట అర్థాన్ని సూచించే పదంగా స్థిరపడిపోయింది. తరువాత 1826లో షెల్లీ రాసిన ది లాస్ట్ మాన్, తరువాత ఎడ్గార్ అల్లెన్ పోయ్ రాసిన ఫ్లైట్ టు ది మూన్ సంచలనం సృష్టించాయి. విద్యుత్తు, టెలిగ్రాఫ్, కొత్త రవాణా సాధనాలు వచ్చాక శతాబ్దం చివరిలో హెచ్‌జి వెల్స్, జూల్స్ వెర్న్ వంటి గొప్ప సైన్స్ ఫిక్షన్ రచయితలు వచ్చారు. వాస్తవానికి ఈ ఇద్దరు రచయితలనూ, మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ పత్రిక నెలకొల్పిన గెర్న్స్‌బాక్‌నూ సైన్స్ ఫిక్షన్ పితామహులుగా పేర్కొంటారు.

> ***హ్యూగో గెర్న్స్‌బాక్ రచయిత, సంపాదకుడు, పత్రికా ప్రచురణ కర్త. ఈయన మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ పత్రిక స్థాపించడం ద్వారా ఈ రచనలకు ఎనలేని సేవ చేశారు.***

**జూల్స్ వెర్న్** ఫ్రెంచ్ కవి, నవలా రచయిత, నాటక రచయిత. సాహసాన్ని, శాస్త్ర పరిశోధననూ మేళవించి ఆయన రాసిన సైన్స్ ఫిక్షన్ నవలలు 'జర్నీ టు ది సెంటర్ ఆఫ్‌ది ఎర్త్' (1864), 'ట్వెంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ది సీ' (1870), 'ఎరౌండ్ ది వరల్డ్ ఇన్ 80 డేస్' (1873) ప్రఖ్యాతినొందాయి.

**హెచ్‌జి వెల్స్** బ్రిటిష్ రచయిత. ఆయన నవలలు రాశాడు. చరిత్ర, రాజకీయాలు వగైరా అనేక రంగాల్లో నిష్ణాతుడు. 'టైమ్ మెషిన్' (1895), 'ది ఐలాండ్ ఆఫ్ డాక్టర్ మోరియా' (1896), 'ది ఇన్‌విజిబుల్ మాన్' (1897), 'ది వార్ ఆఫ్ ది వరల్డ్స్' (1898), 'ది ఫస్ట్ మెన్ ఇన్ ది మూన్' (1901) మొదలైనవి ఆయన రాసిన గొప్ప సైన్స్ ఫిక్షన్ నవలలు. ఆయన సృష్టించిన టైమ్ మెషిన్ కాన్సెప్ట్ ప్రపంచ ప్రఖ్యాతి పొందింది.

**హ్యూగో గెర్న్స్‌బాక్** రచయిత, సంపాదకుడు, పత్రికా ప్రచురణ కర్త. ఈయన మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ పత్రిక స్థాపించడం ద్వారా ఎనలేని సేవ చేశారు.

20వ శతాబ్దంలో ఇంగ్లండ్‌లోనూ, ఇతర యూరప్ దేశాల్లోనూ పలువురు రచయితలు సైన్స్ ఫిక్షన్ రాసినా ప్రధానంగా అమెరికా ఈ రచనలకు, రచయితలకు కేంద్రంగా మారింది. హాలీవుడ్ సినీ ప్రపంచం అనేక సైన్స్ ఫిక్షన్ సినిమాలు వెలువరించింది. ప్రఖ్యాతి గాంచిన అనేక టెలివిజన్ సీరియల్స్ వచ్చాయి. జాన్ కాంప్‌బెల్, ఇస్సాక్ అసిమోవ్, ఆర్థర్ సి క్లార్క్ వంటి అనేక మంది రచయితలు ఈ కాలాన్ని సైన్స్ ఫిక్షన్ స్వర్ణయుగంగా మార్చేశారు. ముఖ్యంగా సైన్సు విజయాలను వీరి రచనల్లో శ్లాఘించారు. అనేక హాలీవుడ్ సైన్స్ ఫిక్షన్ సినిమాలు బాక్సాఫీసు వద్ద ఘనవిజయాలు సాధించాయి. స్టార్ వార్స్, స్టార్ ట్రెక్, ఇటి (ఎక్స్ట్రా టెర్రెస్ట్రియల్), క్లోజ్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ కైండ్, అవతార్

వంటి సినిమాలు మచ్చుకు కొన్ని మాత్రమే. 1990వ దశకం వచ్చేసరికి సైన్సులో ఆశావాదం పోయి నిరాశావాదం బయలుదేరింది. ఈ కాలంలో వచ్చిన రచనలు, సినిమాలు, టీవీ సీరియళ్లు అత్యధిక భాగం సైన్సును ప్రతికూల ఛాయలో చూపడం ప్రారంభించాయి. సైన్సు మనిషికి ఎదురు తిరిగినట్లు రచించేవి ఎక్కువగా వచ్చాయి. గ్రహాంతర వాసుల దాడులు, ముఖ్యంగా వాతావరణ మార్పులతో భూమి ప్రమాదంలో పడడం వంటి రచనలు, సినిమాలు ఎక్కువగా వచ్చాయి.

*వీడియో గేములు, పజిల్స్, సోషల్ మీడియా కొంతవరకు వారి ఊహకు పదును పెడుతున్నా వాటికి చాలా చాలా పరిమితులున్నాయి. పదేపదే వాటిని చూడ్డం వల్ల మళ్లీ యాంత్రికత పెరుగుతోంది.*

**భారత దేశంలో....**

భారత దేశంలో సైన్స్ ఫిక్షన్ రచనలు చాలా ఆలస్యంగా వచ్చాయి, చాలా తక్కువగా కూడా వచ్చాయి. మన దేశంలో మొట్టమొదటి సైన్స్ ఫిక్షన్ రచన 1879లో బెంగాలీలో వచ్చింది. ప్రముఖ శాస్త్రవేత్త జగదీష్ చంద్రబోస్ బెంగాలీలో అద్భుతమైన సైన్స్ ఫిక్షన్ రచనలు చేశారు. మన దేశంలో సైన్స్ ఫిక్షన్‌లు ఎక్కువ భాగం బెంగాలీలో వచ్చాయి. తరువాత కొద్దిగా మరాఠీలోనూ, హిందీ, అస్సామీ, తమిళంలోనూ వచ్చాయి. తెలుగులో సైన్స్ ఫిక్షన్ నవల ఒక్కటీ రాకపోవడం విచారకరం.

భారతీయ సైన్స్ ఫిక్షన్ సినిమాల సంగతీ అంతే. ప్రధానంగా హాలీవుడ్ డబ్బింగులు, అనుకరణలు మినహా మనదంటూ ప్రత్యేకత సంతరించుకున్న సైన్స్ ఫిక్షన్ సినిమాలు మనకు చాలా తక్కువ. వచ్చిన వాటిలో కూడా హిందీ, తమిళం మినహా మిగిలిన భాషలో వచ్చిన సినిమాలు చాలా తక్కువ. ఇటీవల వచ్చిన తమిళ సైన్స్ ఫిక్షన్ సినిమా రోబో మూడు భాషల్లో విడుదలై సంచలనం సృష్టించడమే కాక, బాక్సాఫీసు వద్ద పెద్ద ఎత్తున వసూళ్లు చేసిన సంగతి తెలిసిందే. సైన్స్ ఫిక్షన్ సినిమాల విషయంలో కూడా రెండు తెలుగు రాష్ట్రాలూ బాగా వెనుకబడే ఉన్నాయి. వాస్తవానికి తెలుగులో ఒరిజినల్‌గా వచ్చిన సైన్స్ ఫిక్షన్ సినిమా 1991లో విడుదలైన 'ఆదిత్య 369' ఒక్కటే.

**సైన్స్ ఫిక్షన్ చాలా అవసరం**

సైన్స్ ఫిక్షన్ కేవలం వినోదం మాత్రమే కాదు విజ్ఞానం కూడా. ఈ ప్రక్రియలో రచయితలకు సాహిత్యం మీద పట్టు ఉండడమే కాదు, సైన్సుపై లోతైన అవగాహన ఉండాలి. తన నవల, లేక కథ లేదా నాటకం ద్వారా ఆయన పాఠకునితో సైన్సు గురించి, దాని భవిష్యత్తు గురించీ, సైన్సుకూ, సమాజానికీ ఉన్న సంబంధం గురించీ చర్చించాలి. అదే సమయంలో సైన్స్ ఫిక్షన్ అనేది కేవలం సైన్సు గ్రంథం కాదు, పాపులర్ సైన్సు రచనా కాదు. అదో నవల, కథ లేక నాటకం, సినిమా లేక టివి సీరియల్. అంటే అదో సాహిత్య ప్రక్రియ అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఇలా సైన్సునూ, సాహిత్యాన్నీ జమిలిగా సాగించడమే సైన్స్ ఫిక్షన్. అటువంటి రచనలు నేటి తరం పిల్లలకు, యువతకు మరింత అవసరం. ఎందుకంటే నేటి విద్యావిధానం పిల్లల్లో ఊహాశక్తిని పోగొట్టి వారిని పోటీ జీవులుగా, మార్కులు సాధించే యాంత్రిక జీవులుగా మార్చేస్తోంది. వీడియో గేములు, పజిల్స్, సోషల్ మీడియా కొంతవరకు వారి ఊహకు పదునుపెడుతున్నా వాటికి చాలా చాలా పరిమితులున్నాయి. పదేపదే వాటిని చూడ్డం వల్ల మళ్లీ యాంత్రికత పెరుగుతోంది.

కానీ సైన్స్ ఫిక్షన్ అలా కాదు. పిల్లలకు అది కథ చెబుతుంది. సైన్సు చెబుతుంది. సమస్యలను వారి ముందు ఉంచుతుంది. వాటికి సైన్సు ఆధార పరిష్కారాలపై చర్చ పెడుతుంది. సంభవాల చక్రం నుండి వారిని బైట పడేస్తుంది. సైన్స్ ఫిక్షన్ పిల్లలు, పెద్దల మెదడుకు పదును పెడుతుంది. వారి ఊహలకు రెక్కలు తొడుగుతుంది. వారిలో సృజనాత్మక శక్తిని పెంచుతుంది. కానీ మన తెలుగు రాష్ట్రాల్లో ఇటువంటి రనలు చేసేవారు లేకపోవడం, ఇతర భాషల నుండి అనువాదాలు కూడా తక్కువగా ఉండడం శోచనీయం. 1950, 60 దశకాల్లో తెలుగులోకి ఈ సాహిత్య అనువాదాలు పెద్ద ఎత్తున వచ్చాయి. అవంతి పబ్లికేషన్స్ ద్వారా మహీధర రామమోహన రావు పలు సోవియట్ సైన్స్ ఫిక్షన్ నవలలను తెలుగులోకి అనువదించారు. తరువాత సోవియట్ యూనియన్ నుండి వచ్చిన ప్రగతి పబ్లికేషన్స్ కూడా కొన్ని అనువాదాలు తీసుకొచ్చింది. అయితే అవి చాలా పరిమితంగానే జరిగాయి.

ఆధునిక సైన్సు అనేక కొత్త రంగాలను తెరిచింది. జెనిటికల్ ఇంజినీరింగ్, నానో టెక్నాలజీ, రోబోటిక్స్...వీటితో బాటు స్పేస్ ట్రావెల్స్ కథలు ఉండనే ఉన్నాయి. వీటి ఆధారంగా సైన్స్ ఫిక్షన్ రచనలు ఇబ్బిడి ముబ్బిడిగా రావాలి. అటువంటి రచనలను, రాసేవారినీ ప్రోత్సహించాలి.

❋

## వేగం

- దుప్పాడ రామకృష్ణనాయుడు
8790408525

వేగం...
ఎక్కడ చూసినా...
ఏం చేసినా...
లేచింది మొదలు
పడుకునేంత వరకూ
అందరినోటా
వేగం...వేగం...వేగం...
అసలెందుకీ వేగం
ఏమి సాధిద్దామని?
ఎవరినుద్ధరిద్దామని?
సూర్యుడు తన వేగాన్ని పెంచుకోలేదు
చంద్రుడు తన కాలాన్ని కుదించుకోలేదు
భూమి తన భ్రమణ పరిభ్రమణ వేగాలను మార్చుకోలేదు
నెల మారేది సగటున ముప్పది రోజులు ముగిసాకే
సంవత్సరాది వచ్చేది పన్నెండు నెలలు గడిచాకే
అమ్మ కడుపులోని బొమ్మ లోకాన్ని చూసేది నవమాసాలు నిండాకే
చెట్టు నుండి కాయ రాలేది పూర్తిగా పండేకే
పశు పక్ష్యాదులలో కొంచెమైనా మారని వేగం



ప్రకృతిలో ఎక్కడా కానరాని వేగం
మరి మనిషి కెందుకో
తక్కువ వేతనంతో
ఎక్కువ పనిచేయించుకొని
ధరిత్రిలోని సంపదనంతా వేగంగా దోచుకొని
అనతి కాలంలోనే
అత్యంత ధనవంతుడవ్వాలనే
నీ దురాశ సృష్టి కాదా ఈ వేగం
సంపద పెంపులో దూసుకెళ్ళిన వేగం
దాని పంపిణీలో మందగించింది... ఏమ్మాయరోగం?
ధనవంతుడికి భోగం....
దరిద్రుడికి రోగం...
అభివృద్ధికి అవసరమే కొంత వేగం
కాని, అదుపులేని వేగం మనిషి మనుగడకే ప్రమాదం
నువ్వు సృష్టించిన ఈ వేగం నిన్నే అంతం చేస్తోంది
అందుకే... ఓ మనిషీ
గమనించి కళ్ళెం వెయ్యి దానికి వేగం
లేకుంటే...
బలైపోతావు దానికి వేగం!

❋

## నేలమాలి

- కొత్తపల్లి సురేశ్
9493832470

ఇపుడు మా ఊరి పొలాల్లో ఎక్కడచూసినా
రెక్కలల్లార్చుకుంటూ తెల్లనికొంగలు
పచ్చనోట్లకార్పెట్ మీదుగా నడిచివస్తున్న కార్పొరేట్ దొంగలు

నేలచుట్టే అల్లుకున్న ప్రేమల పోగులు తెంపి
నిర్దాక్షిణ్యంగా నిర్వాసితుల్ని చేస్తున్నారు
భావిని భుజాన మోస్తున్న నేలమాలిని -
అస్త్రసన్యాసిని చేసి యుద్ధభూమిలో నిలబెడుతున్నారు
రూకల పేకమేడల నిర్మాణంలో
రైతాంగాన్ని సమిధను చేస్తున్నారు

ప్రపంచీకరణ పడగనీడలో
కాసుల పడవల మీద ఖండాంతరాలు దాటి వచ్చి
తీరప్రాంతాల్ని జలగలై పీల్చేస్తున్న
పెట్రోకారిడార్లూ, సెజ్ లూ



ఆదివాసీల గుండెల గుడారాల్ని పేల్చేస్తున్న గ్రీన్హంట్లు
అన్నీ దోపిడీకి పర్యాయపదాలు

ఆకుపచ్చని ఆకాశంలో జయకేతనమై ఎగరాల్సిన రైతు
నేడు, పొలంగనిలో ఊపిరాడని కార్మికుడైపోయాడు
పైరగాలికి పంచనామా జరిగాక
రైతుకిక శ్వాస ఎలాఅందుతుంది???
**(దొరికినకాడికి అమాయక రైతుల భూములు కొని గాలిమరలు నెలకొల్పిన కార్పొరేట్ శక్తులపై నిరసనగా)**

❋

ప్యాలకుర్తి గ్రామం ❖ కర్నూలు జిల్లా

# జానపదుల నమ్మకాలు ❖ పాటలు



*తమ కళల ద్వారా కాస్తో కూస్తో వినోదంతో కూడిన జ్ఞానాన్ని భారతీయ బహుజన సమాజానికి అందిస్తూ వచ్చిన ప్రత్యేకత జానపదులది. జానపద పాండిత్యం జీవం పోసుకొని ఉండాలంటే భారతీయ ఆత్మకు ప్రతీకగా వున్న పల్లె సమాజం సజీవంగా వుండాలి. అదే విధంగా జానపదుల ప్రధాన వృత్తి అయిన వ్యవసాయం దాని అనుబంధ వృత్తులు నిరంతరంగా అభివృద్ధి చెందుతూ వుండాలి.*

- డా॥ యాదవ రఘు
9963037305

జానపదాలలో (పల్లెటూళ్ళు) నివసించే జానపదులు (పల్లె ప్రజలు) తమ శ్రమైక జీవితాన్ని మరచిపోడానికి వెలువరించిన భావావేశమే జానపద వాఙ్మయం. జానపదుల పాటల్లో ఛందస్సు, వ్యాకరణం కన్పించకపోయినా ఇది విస్తృత ప్రచారంలోకి వచ్చింది. జానపద గేయం లేక శ్రామిక గేయం. ఇది సామూహిక లేదా వ్యక్తిగత శారీరక శ్రమకు సంబంధించిన ఏదో ఒక రూపాన్ని నడిపించే ఒక ఉపకరణం. ఈ వాఙ్మయం గురించి క్రీ. శ. 1703 లో స్కాట్లాండ్ దేశస్తుడు ఆండ్రూ ఫ్లెచర్ 'జానపద గీతాలు ఆయా దేశాల లేక జాతుల, ఆ ప్రాంతపు శాసనాల కంటే ఎక్కువ విలువైనవి' అని నిర్వచించాడు.

ఆంగ్లంలో **folk lore** అని పిలువబడే ఈ పదం రెండు శబ్దాల కలయికతో ఏర్పడిన సమాసమని **folk** అంటే **unlattered peasantary** (నిరక్షరకుక్షులైన రైతులు), **lore** అంటే **learning of knowledge** (పాండిత్యం లేక విజ్ఞానం) అని, **folk lore** అంటే అక్షర జ్ఞానం లేని పల్లె ప్రజల సాంప్రదాయక విజ్ఞానం. అదే జానపద విజ్ఞానం అని క్రీ.శ. 1846 లో **W.J. Thomas** అనే పరిశోధకుడు పేర్కొన్నాడు.

జానపద విజ్ఞానం ద్వారా ప్రాచీన కాలానికి సంబంధించిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక స్థితి గతులను సమకాలీన, భవిష్యత్ తరాల వారికి అందిచడంలో పల్లె సమాజం, రైతాంగ సమాజం ఒక మాధ్యమంగా ఉంటూ వస్తున్నది. అనాదిగా చదువు సంధ్యలు అగ్రవర్ణాలకే పరిమితమౌతూ వచ్చిన నేపథ్యంలో తమ కళల ద్వారా కాస్తో కూస్తో వినోదంతో కూడిన జ్ఞానాన్ని భారతీయ బహుజన సమాజానికి అందిస్తూ వచ్చిన ప్రత్యేకత జానపదులది. జానపద పాండిత్యం జీవం పోసుకొని ఉండాలంటే భారతీయ ఆత్మకు ప్రతీకగా వున్న పల్లె సమాజం సజీవంగా వుండాలి. అదే విధంగా జానపదుల ప్రధాన వృత్తి అయిన వ్యవసాయం దాని అనుబంధ వృత్తులు నిరంతరంగా అభివృద్ధి చెందుతూ వుండాలి.

ఒకనాటి స్వయం పోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అన్ని కుల వృత్తుల వారికి ఫలసాయ పంపిణి జరిగేది. రాశి నుండి మిరాశి వాటా లభించేది. క్రమంగా వీరిని వెట్టిచాకిరి స్థాయికి కుదించడం ఒక దుర్మార్గపు ప్రక్రియ అయినా తిండి గింజలకు కొరత వుండేది కాదు. బ్రిటీష్ వారు రావటంతో స్వయం పోషక గ్రామీణ వ్యవస్థ చిన్నా భిన్నమైంది. అభివృద్ధి పేరిట గ్రామాల్లో వివిధ వృత్తి కులాల వారు అనాథలై

చెల్లా చెదురై పోయారు. స్వాతంత్ర్యానంతర పరిస్థితుల్ని పరిశీలిస్తే "పావురాయి టపాలు, కాలినడక కాశీ యాత్రలు, నాటు మందుల మోటు వైద్యాలు, మూఢ భావాలు, రాక్షస రాజ్యాలు, బానిస బంధాలు, తాళ పత్రాలు పోయి, ఐ టి విప్లవంతో, ఇంటర్నెట్ సాయంతో దూరాలు చెరిగి ... విజ్ఞాన సర్వస్వం సి.డి.లో ఒదిగి, ఏళ్ళ లోకం బుల్లి గ్లోబల్ గ్రామంలా సన్నిహితమైన దశలో మానవ మేధ విశ్వ రూపాన్ని చూసి ఒళ్ళు పులకరించనిదెవరికి. కాని తేరిపార చూస్తే ఈ విజ్ఞాన వేగమే ఆందోళనను కల్గిస్తుంది. పట్టణాల్లోని సౌకర్యాలు, జీవన అలవాట్లు క్రమ క్రమంగా గ్రామాలకు చేరుతుండటంతో గ్రామ సంస్కృతికి, పట్టణ సంస్కృతి కి మధ్య అంతరాలు మాసిపోతున్నాయి. ఈ క్రమంలో గ్రామీణులు ఆధునికీకరణ మోజులో పడి వారి వారి చారిత్రక, సాంస్కృతిక, జీవితాన్ని వారే మరచిపోయే స్థితి ఎదురౌతున్నది.

అవర్ కల్చర్ ఈజ్ అగ్రికల్చర్ అని గొప్పలు చెప్పుకుంటున్న మన దేశంలో యాంత్రికీకరణ, ఆధునికీకరణ పేరుతో నిరుద్యోగిత ప్రబలి రైతు కూలీలకు బాసటగా నిలవలేక వ్యవసాయ వ్యవస్థ అభివృద్ధికి బదులు అభివృద్ధి విధ్వంసాన్ని రుచి చూస్తోంది. ఈ నేపథ్యంలో వ్యవసాయం మరియు దాని అనుబంధ వృత్తుల తో పాటు వారికి మాత్రమే సొంతమైన జానపద విజ్ఞానం కూడా ధ్వంసమైపోతుంది. కావున భవిష్యత్ తరాల వారు జానపదుల సంస్కృతి, విజ్ఞానం ఇలా వుండేది అని తెలుసుకోవాలంటే ధ్వంసమైపోతున్న వీటిని రికార్డు చేసి భద్రపరచాల్సిన అవసరం ఉంది.

ఇప్పటికే జానపద పాండిత్యం పై చాలా పుస్తకాలు వచ్చాయి, వస్తూనే ఉన్నాయి. అయితే పల్లె ప్రమాదపుటంచుల్లో వున్న నేటి నేపథ్యంలో ప్రతి పల్లెలో క్షేత్ర పరిశోధనను నిర్వహించాలి. ఇదే సమయంలో ఆంధ్ర ప్రదేశ్ అనేది ఒక రాష్ట్రమైనప్పటికీ అన్ని రంగాలలో కూడా భిన్నత్వాన్ని కల్గిన రాయలసీమ, కోస్తాంధ్ర ప్రాంతాల కలయిక. అయితే కోస్తాంధ్ర చరిత్ర, సంస్కృతి, అభివ ృద్ధి నమూనాలనే ఈ రాష్ట్ర చరిత్ర, సంస్కృతి, అభివృద్ధిగా చూపిస్తూ వస్తున్నారనేది నిజం. అన్ని కోణాల్లో కూడా రాయలసీమ అస్తిత్వం ప్రశ్నార్థకం. పాఠ్యంశాలలో గాని, సినిమాలలో గాని రాయలసీమ జానపదానికి తగినంత స్థానముండదు. ఒకవేళ వున్నా కూడా అది నెగటివ్ గానో లేదా వ్యంగ్యంగానో చూపించే ప్రయత్నాలు జరుగుతాయి. ఈ నేపథ్యంలో రాయలసీమలో ఒక గ్రామమైన ప్యాలకుర్తి ని ఎన్నుకొని క్షేత్ర పరిశోధన ద్వారా తెలుసుకున్న విషయాలే ఈ వ్యాసం.

సాధారణంగా గ్రామీణ రైతుకూలీలు పొలం పనులు చేసేటపుడు అలసట తెలియకుండ ఉండేందుకు, ఉత్సాహంగా పని చేసేందుకై వ్యంగ్యంగానూ, తమాషాగాను వరసైన వారిపై రకరకాల పాటలు పాడుకుంటారు. మన దేశంలోని కరువు ప్రాంతాల్లో రాయలసీమ కూడా ఒకటి. ఈ ప్రాంత కరువు గురించి వెంకట లచ్చుమ్మ మాటల్లో చెప్పాలంటే ప్రస్తుత పరిశోధక గ్రామంలో పూర్వం ఒకసారి కరువు వస్తే తినడానికి తిండి లేక రేగడి మట్టిని మెత్తగా దంచి జల్లెడ పట్టి, ఆ రేగడి మట్టి పౌడర్ లోకి పెరుగు కలుపుకొని తిన్నారట. ఇలా తిని చాలా మంది చనిపోయారట. కాబట్టి వానకోసరం పాటలు ఇక్కడి ప్రజల గొంతుల్లో నిరంతరం వినపడుతూనే ఉంటాయి. సాధారణంగా నిరంతర నీటి సౌకర్యంవల్ల కోస్తా ప్రాంతంలో హైలెస్సో ...హైలెస్సో... వంటి సంతోషంతో కూడిన పాటలు వినిపిస్తాయి. అలాగే నదులు పొంగ కుండ పూజలు చేస్తారు. కాని రాయలసీమలో మాత్రం వాన కోసం ఎదురు చూస్తూ బాధతో పాటలు పాడుకుంటారు.

కుమ్మరి వారు తయారు చేసిన జోకరయ్య బొమ్మను గంపలో పెట్టుకొని బారిక (బెస్త) కులస్తులు ఈ క్రింది పాట పాడుతూ గ్రామం లోని ఇంటింటికి తిరుగుతారు. గ్రామస్తులు వీరికి తిండి గింజలు పెట్టి పంపుతారు.

*వానదేవుని కృప వరపైన కృపా ...*
*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*
*ఇంగనన్న గురువయ్య ... జగమేలే సామి ...*
*వానా గురిపించూ ... వానదేవా ... వానా గురిపించూ ... వానాదేవా ...*
*గురిసేవు గురిసేవు కుమ్మ వర్షంబూ ...*
*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*
*పెద్ద పెద్ద దేవర్లు పెద్దేరు దాటే ...*
*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*
*సిన్న సిన్న దేవర్లు సిన్నేరు దాటే ...*
*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*
*వానదేవుని కృప వరపైన కృపా ...*
*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ*

*... వానాదేవా ...*

*ఇంగానన్న గురువయ్య ... జగమేలే సామి ...*

*వానా గురిపించూ ... వానదేవా ... వానా గురిపించూ ... వానాదేవా ...*

*గురిసేవు గురిసేవు కుమ్మ వర్షంబూ ...*

*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*

*గుల్లి కొప్పులల్లా గుంద్రాళ్ళ పాలయే ...*

*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*

*ఎద్దు లాంటి మొగోల్లు ఎదురై వచ్చిరే ...*

*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*

*వానదేవుని కృప వరపైన కృపా ...*

*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా ...*

*ఇంగనన్న గురువయ్య ... జగమేలే సామి ...*

*వానా గురిపించూ ... వానదేవా ... వానా గురిపించూ ... వానాదేవా ...*

*గురిసేవు గురిసేవు కుమ్మ వర్షంబూ ...*

*వానా గురిపించూ ... వానాదేవా... వానా గురిపించూ ... వానాదేవా...*

ఈ గ్రామంలో వాన పడక పోతే కొందరు మాదిగ కులానికి చెందిన పిల్లలు రోకలి బండకి రెండు వైపులా యాప మండలు, మధ్యలో కప్పను తలక్రిందులుగా కట్టుకొని రెండు వైపులా చెరో భుజం పైన పెట్టుకొని ఇంటింటికీ తిరుగుతూ .

*కప్పమ్మ నీల్లాడే ... కడవొద్ది వానొచ్చే ...*

*గు (కు)రవయ్యో ... గురవయ్యో ...*

*చీమమ్మ నీల్లాడే ... చిట పట వానొచ్చే*

*గురవయ్యో ... గురవయ్యో ...*

*చీమమ్మ నీల్లాడే ... చిట పట వానొచ్చే*

*గురవయ్యో ... గురవయ్యో ...*

*కప్పమ్మ నీల్లాడే ... కడవొద్ది వానొచ్చే ...*

*గురవయ్యో ... గురవయ్యో ...*

అనే పాటను పాడుతారు. ప్రతి ఇంటి వారు నిండు కడవ నీళ్ళు తీసుకొని పిల్లలపైన మరియు కప్పమ్మ పైన పోసి, వారికి వడ్లు, జొన్నలు లేక కొర్రలు ఇలా ఏవైనా తిండి గింజలు పెట్టి పంపుతారు. ఇలా చేస్తే వాన పడుతుందని వీరి నమ్మకం. సాధారణంగా దళితులకు పొలం వుండదు. వీరి జీవితమంతా కూలీ బ్రతుకే. మరి వానలు రాక పోతే కూలికి వెళ్ళటానికి కూడా అవకాశం వుండదు. ఇలాంటి పరిస్థితులలో వారి బ్రతుకు నడవటం కష్టం. కాబట్టి కప్పమ్మ పెండ్లి పాట పాడుతూ తిరిగినపుడు రైతులు వీరికి గింజలు పెట్టడం వల్ల వాన వచ్చే దాక కొంతమేర వారి కుటుంబాలు గడుస్తాయి.

ఈ క్రింది పాట ద్వారా గ్రామంలో వానలేక పంటలు నాశనమయ్యాయని పంటలు పండనందుకు గ్రామ రెడ్డి సైతం తన బిడ్డకు పెళ్లి సేయలేక పోయాడని ఈ పాత సీమ కరువు సంస్కృతిని తెలియ జేస్తుంది.

*మిద్దె మీద మిరప సెట్టు సందమామా ...*

*వానా లేక ఎండిపాయా సందమామా ...*

*మన వూరి రెడ్డి బిడ్డ సందమామా ...*

*మొగుడు లేక గొడ్డు బాయా సందమామా ...*

బారకట్ట, చిల్లగోడ, గోలీలాట, బొంగరాలాట మొదలైన ఆటలు ఆడితే వాన పడదని ఈ గ్రామీణుల నమ్మకం. కాబట్టి వాన రాని సమయంలో పిల్లలు ఎవరైనా ఈ ఆటలు ఆడితే పెద్దలు వారిని తిడుతుంటారు.

గెలం కట్టినపుడు ఎద్దులు తమ మూతి ఆకాశం వైపు పైకెత్తి వాసన చూస్తే వాన వస్తుందని అలాగే గొర్రెల మందలో నుండి ఒక గొర్రె అర్ధాంతరంగా లేచి పడమటి దిక్కుకి వెళ్లి వెల్లకిలా పడుకొని నాలుగు కాళ్ళు ఆకాశం వైపు పైకెత్తి మట్టిలో పొర్లాడితే వాన వస్తుందని నమ్మకం. అందుకే ఎన్నాళ్ళైనా వాన రాకపోతే గొల్ల వారిని (గొర్రెల కాపరులను) గ్రామస్తులు వాన ఎపుడు వస్తుందో చెప్పమని అడుగుతుంటారు7.

గ్రామంలోని బొడ్రాయికి, ఆంజనేయస్వామి విగ్రహానికి లేదా గోకారం కట్టపైన వుండే గోకారమయ్య లేదా దస్తగిరయ్య స్వామికి 101 కడవల లేదా బిందెల నీళ్ళు పోస్తే వాన వస్తుందని నమ్మకం.

గ్రామంలోని చెన్నకేశవ స్వామి గుడిలో కూర్చొని వెంకటమ్మ యాదవ్ కొడుకు యాదవ రంగదాసు అనే వ్యక్తి వరుసగా మూడు రోజుల పాటు మహా భారతంలోని విరాట పర్వం ను చదువుతాడు. ఇలా చదివిన తర్వాత వాన వస్తుందని నమ్మకం. పాండవులు వున్న దగ్గర అంతా బాగుంటుందని పాండవులని తలచుకుంటే వానపడుతుందని వీరి నమ్మకం.

వానొచ్చే సమయంలో ఉరుములు వస్తే ఈ జానపదులు "అర్జునా! భీమా!... అని గట్టిగా పలుకుతారు. ఇలా పలికితే

ఇక్కడ పడే ఉరుము ఆమడ దూరంలో వెళ్లి పడుతుందని నమ్మకం.

కలుపు తీసేటపుడు అలుపు కనబడకుండా వుండటం కోసం సాధారణంగా స్త్రీలు ఎక్కువగా పాటలు పాడుతుంటారు. ఇవి బావ వరుసైన వారిపై మరదళ్ళు చమత్కారంగా, వ్యంగంగాను, కొంచెం మోటు సరసంతోను పాడతారు.

*ఎచ్చులకీ మా బావా సైకలు గొన్నాదే ... సైకలు గొన్నాదే*

*సైకాలు దొక్కాలేక ... సైకాలు దొక్కాలేక సందులో బడినాదే ... సందుల బడ్నాదే*

*అబ్బా( వతని సోకే ...*

*అబ్బా( వతని సోకే తుమ్మకాయల జోపోటే*

*ఎచ్చులకీ మా బావా కారును గొన్నాదే ... కారును గొన్నాదే*

*కారును నడపాలేక ... కారును నడపాలేక కాల్వలో బడినాదే ... కాల్వలో బడినాదే*

*అబ్బా( వతని సోకే ...*

*అబ్బా( వతని సోకే తుమ్మకాయల జోపోటే*

*ఎచ్చులకీ మా బావా బండిని గొన్నాదే ... బండిని గొన్నాదే*

*బండిని నడపాలేక ... బండిని నడపాలేక బార్లా బడినాదే ... బార్లా బడినాదే*

*అబ్బా( వతని సోకే ...*

*అబ్బా( వతని సోకే తుమ్మకాయల జోపోటే*

అదేవిధంగా తనను తన మొగుడు కొట్టాడని, దానితో తనకు ఆరోగ్యం బాగా లేదని స్త్రీ పాడే పాట ..

*ఎన్నడు గొట్టని నా మొగుడు*
*అవాల గింజతో గొట్టెనమ్మా ...*
*కీళ్ళు కీళ్ళు నొప్పులమ్మా*
*నా సిటికెనేలికి జరమమ్మా...*

*ఎన్నడు గొట్టని నా మొగుడు*
*సెలకాలతోనే గొట్టెమ్మా ...*
*కీళ్ళు కీళ్ళు నొప్పులమ్మా*
*నా సిటికెనేలికి జరమమ్మా...*

*ఎన్నడు గొట్టని నా మొగుడు*
*ముల్లూ బర్రెతో గొట్టెనమ్మా ...*
*కీళ్ళు కీళ్ళు నొప్పులమ్మా*
*నా సిటికెనేలికి జరమమ్మా...*

*ఎన్నడు గొట్టని నా మొగుడు*
*పచ్చిదంటుతోనే గొట్టెనమ్మా...*
*కీళ్ళు కీళ్ళు నొప్పులమ్మా*
*నా సిటికెనేలికి జరమమ్మా ...*

ఈ క్రింది పాట ఒక వైపు గ్రామం లోని యాదవ, రెడ్డి కులాలకు చెందిన యువకుడు, యువతిల యొక్క ప్రేమ కథాంశాన్ని తెలియజేయడమే గాక రెడ్డి కులానికి చెందిన యువతీ తన గొల్లబాయడి కోసం తన కుటుంబాన్ని దిక్కరిస్తున్న వైనం కుడా తెలియజేస్తుంది. రెడ్ల పట్ల గొల్లలకున్న వ్యతిరేకత, చులకన భావం కూడా అర్థమవుతుంది. ఈ గ్రామాన్ని యాదవులే నిర్మించడం, యాదవుల జనాభా అధికంగా వుండటం, గ్రామంలోని అధిక శాతం వ్యవసాయ పొలం యాదవుల ఆధీనంలోనే వుండటం బహుశా దీనికి కారణమై ఉండవచ్చు.

*మంచినీళ్లా బాయి కాడా ...*
*ఏడు గుంజల మచ్చు పైనా ...*
*ఏడు గుంజల మచ్చు పైనా...*
*గొల్లబాయదే కావిలమ్మా ...*

*ఎండిదీ పులిగోవు ...*
*ఎలనాదం బట్టినాదే ...*
*పగిడిదీ పులిగోవు ...*
*పలనాదం బట్టినాదే ...*
*ఆ నాదం వీ నాదం ...*
*రెడ్డి బిడ్డ సెవులబడే ..*

*గొల్ల బాయడ ... గొల్ల బాయడ ...*
*నీ ఎంపాడి నేనొస్తా...*
*వచ్చే దానవు వస్తా గాని ...*
*మీయమ్మకన్నా సెప్పి రాపోయ్యే ...*
*మా యమ్మ కన్నా జూసుకుంటే ...*
*నా గొల్ల బాయదే ఎల్లిపోతడే ...*

*అమ్మారో ఓ యమ్మా...*
*నేను నీళ్ళకీ బోతనమ్మా...*
*వద్దమ్మా వడి పిల్లవూ...*
*వపకీరితి వస్తదమ్మా...*
*మనకపకీరితి వస్తదమ్మా...*

ఫోమ్మన్నా ఫోతనమ్మా...
వద్దన్నా ఫోతనమ్మా...
పోయ్యేదానవ్ పోదు గానీ ...
పాలన్నం దినీ పోయే ...
పాలన్నం పాడుగాను ...
ప్రాణనాథుడే ఎల్లిపోతడే ...

గొల్ల బాయడ ... గొల్ల బాయడ ...
నీ ఎంపాడి నేనొస్తా...
వచ్చే దానవు వస్తు గాని ...
మీయన్నకన్నా సెప్పి రాపోయ్యే ...
మా యన్న కన్నా జూసుకుంటే
నా గొల్ల బాయడే ఎల్లిపోతడే ...

వన్నగా ఓ యన్నా ...
నేను నీళ్ళకి బోతనన్నా ...
వద్దమ్మా వడి పిల్లవూ...
వపకీరితి వస్తదమ్మా...
మనకపకీరితి వస్తదమ్మా...
ఫోమ్మన్నా ఫోతనన్నా...
వద్దన్నా ఫోతనన్నా...
నాకేమి జెప్పేవు ...
మీ నాయనకన్నా జెప్పి ఫోయే ...

నాయనారో ఓ నాయన ...
నేను నీళ్ళకి బోత నాయన...
వద్దమ్మా వడి పిల్లవూ...
వపకీరితి వస్తదమ్మా...
మనకపకీరితి వస్తదమ్మా...
ఫోమ్మన్నా బోత నాయన ...
వద్దన్నా బోత నాయన ...
ఫోయ్యే దానవ్ ఫోదు గాని ...
నేయ్యన్నం దిని పొయ్యే...
నేయ్యన్నం పాడుగాను ..
నా ప్రాణనాథుడే ఎల్లిపోతడే ...
అన్నుంటి ఓ యమ్మా...
మంచి నీళ్ళా బాయి కొచ్చా...

ఎడుగుంజల మచ్చు పైనా...
గొల్లబాయడే కావిలుండడు ...
ఎండీది పులిగోవు...
ఎలనాదం పట్టెనమ్మా ...
పగడీది పులిగోవు ...
పలనాదం పట్టెనమ్మా ...
ఆ నాదం వీ నాదం ...
రెడ్డి బిడ్డ సేవులబడే ...
ఏమయ్యా గొల్ల బాయడ ...
నేనొస్తా నీ ఎంటా...

ఈ క్రింది పద్యంలో కురువ కులానికి చెందిన యువతి, రెడ్డి కులానికి చెందిన యువకుడితో పొలం పని చేసే సమయంలో కాఫీ త్రాగమని, అన్నం తినమని, పెరుగన్నమన్నా తినమని అడుగుతుంది. రెడ్డి కులస్తుడిని 'మామా' అని సంభోదిస్తూ తన అభిమానాన్ని చాటుతుంది. కాని రెడ్డి కులస్థుడు మాత్రం తక్కువ కులానికి చెందిన వారిచ్చే కాఫీ తాగను, అన్నం తినను అని అంటాడు. దీన్ని బట్టి గ్రామంలో వివిధ కులాల మధ్య వుండే అసమానతలు అర్థమవుతాయి. అన్ని కులాల వారు ఒకరినొకరు వావి వరసలతో పిలుచుకునే గ్రామీణ సాంప్రదాయం కూడా అర్థమవుతుంది.

నల్ల నల్లా రేగడి లోనా
తెల్ల జొన్నా సేనీ లోనా ...
వందా లేదు పొందా లేదూ
ఓ మామా బసిరెడ్డి ...
కాపైనా జేసినాను
లోట లోనా బోసినాను ...
తాగేన్నా పోదువురాయే
ఓ మామా బసిరెడ్డి ...
నువ్వు జూస్తే కురువా దానవు
నేను జూస్తే కాపా వాణ్ని...
కాపెట్టా తాగుదు నేనూ
కురువోల్లా సిన్నా రవని ...
నల్ల నల్లా రేగడి లోనా
తెల్ల జొన్నా సేనీ లోనా ...
వందా లేదు పొందా లేదూ
ఓ మామా బసిరెడ్డి ...
వన్నమేమో జేసినాను

# చెకుముకి రాళ్ళై...

- నవీన్
95537 37304



కప్పుకోడానికి అతడికి దుప్పటి లేదు
అతన్ని అతడే
దుప్పటిలా మడుపుకొని పడుకున్నాడు
ఎవరో ఉండచుట్టి పారేసిన
కాగితంలా పడున్నాడు
అతణ్ణి చూస్తే
ఆకలితో, గాయాల్తో
మూల్గుతున్న కుక్క గుర్తొస్తుంది
పిట్టలన్నీ తినిపోతే
ఒక్క గింజా మిగలకుండా
రాలిపడ్డ జొన్నకంకి కళ్ళల్లో కదలాడుతుంది

వచ్చిన అనకొండమీద
చీమలు తిరిగినట్టు రోడ్డునిండా మనుషులు
దయారహితమై
ఆందోళనలో, ఆవేదనలో
హృదయం లేని ఆగమాగమౌతున్న మనుషులు

పదమటిచలికి గడ్డకట్టిన మనుషులు
విరిగిపోయిన మనుషులు
అతకటాన్ని, బతకటాన్ని మరిచిన మనుషులు
ఇనుపడేగ గోళ్ళకి చిక్కిన మనుషులు

రేపు సూర్యుడు
పువ్వై విచ్చుకుంటే
పిడికిలై ఎగిసిపడితే
నిప్పు రాజేస్తారు
చెకుముకి రాళ్ళై....

❋

---

తల్లెలోనా బోసినాను ...
వన్నమన్నా దిందు రాయే
ఓ మామా బసిరెడ్డి ...
నువ్వు జూస్తే కురువా దానవు
నేను జూస్తే కాపా వాణ్ణి...
వన్నమెట్లా దిందు నేనూ
కురువోల్లా సిన్నా రవని ...
నల్ల నల్లా రేగడి లోనా
తెల్ల జొన్నా సేనీ లోనా ...
వందా లేదు పొందా లేదూ
ఓ మామా బసిరెడ్డి ...
నెత్తి మీనా వన్నం సద్ది
సేతి లోనా పెరుగూ టిఫని ...
వన్నమన్నా దిందు రాయే
ఓ మామా బసిరెడ్డి ...
నువ్వు జూస్తే కురువా దానవు
నేను జూస్తే కాపా వాణ్ణి...
వన్నమెట్లా దిందు నేనూ
కురువోల్లా సిన్నా రవని ...
నల్ల నల్లా రేగడి లోనా
తెల్ల జొన్నా సేనీ లోనా ...
వందా లేదు పొందా లేదూ
ఓ మామా బసిరెడ్డి ...

ఈ విధంగా పైన వివరించబడిన జానపద పాటల ద్వారా గ్రామంలోని కరువు పరిస్థితులు, అగ్రకులాల పట్ల బహుజనులకున్న అభిప్రాయాలు, కులాల మధ్య అంతరాలు ఉన్నప్పటికీ అన్ని కులాల వారు ఒకరినొకరు వరసలు పెట్టి పిలుచుకునే సాంప్రదాయం వెరసి గ్రామీణ జీవన చిత్రణ తెలుస్తున్నది.

❋

# ఒప్పందం



మూలకథ : కెన్యా రచయిత
**గ్యూగివా థింగ్**
అనువాదం : **మౌద్గల్యస**
**9985050134**

**వే**లాది సంవత్సరాల క్రితం నాటి మాట. అప్పట్లో మనుషులు ఇతర నాలుగు కాళ్ళ జంతువుల మాదిరిగా కాళ్లూ, మోచేతుల ఆసరాతో నడిచేవారు. లేడి, చిరుతపులి, రైనాల కంటే వేగంగా పరిగెత్తే వారు. అప్పట్లో మోచేతులు, కాళ్లు దగ్గరగా ఒకదానికొకటి కీళ్లతో అనుసంధానమై ఉండేవి. భుజాలు, నడుము, మోచేయి, మోకాలు, మణికట్టు, చీలమండ, కాళ్లు, చేతులు ఐదు కళ్లతో కలిపి ఉండేవి. బొటనవేలు, ఇతర వేళ్లు దగ్గర దగ్గరగా కలిసి ఉండేవి.

మోచేతులు, కాళ్లూ కవల సోదరుల్లా మెలిగేవి. శరీరం బరువు మోయడానికి ఒకదానికి మరొకటి సహకరించుకునేవి. శరీరం అటూ ఇటూ కదిలి చెట్లెక్కడానికి, పుట్లెక్కటానికి షాపులకో, మార్కెట్లకో వెళ్లడానికి సాయం చేసేవి. ఆఖరికి నీళ్లలో కూడా శరీరం ఈత కొట్టడానికి, మునక వేయటానికి, అటూ ఇటూ సంచరించటానికి దోహదం చేసేవి. ప్రజాస్వామ్య బద్ధంగా శరీరంపైన సంపూర్ణమైన హక్కు ఉన్నట్టుగా వ్యవహరించేవి. అవసరాన్ని బట్టి ఇతర శరీర అంగాల సహకారాన్ని తీసుకునేవి. నోటిని ధ్వని చేయటానికి, చెవి వినడానికి, ముక్కు వాసన చూడటానికి కళ్లు చూడటానికి ఇలా.....

లయబద్ధంగా, ఒకదానికొకటి అందించుకుంటున్న సహకారం, సమన్వయం ఇతర శరీర భాగాలకు కంటగింపుగా మారింది. అప్పుడప్పుడు తమకున్న ప్రత్యేక శక్తి సామర్థ్యాలను అందించేందుకు మొండికేసేవి. వాళ్ళ అసూయ ఏ స్థాయికి చేరిందంటే అసలు ఏ మాత్రం సహకరించక పోతే... ఆ రెండూ ఎలా మనుగడ సాగిస్తాయో చూద్దాం... అనుకునేదాకా వెళ్లాయి.

నాలుక మెదడు నుంచి సూచనలు అందుకుని అందరి కంటె ముందు గట్టిగా నిలదీయటం మొదలు పెట్టింది. మోచేతులు, కాళ్లు... అవేమంత గొప్పవని సూటిగా ప్రశ్నించింది. అంతేకాదు ఈ రెండింటిలోనూ ఏది శక్తివంతమైనదో తేల్చి చెప్పాలని కోరింది కూడా. అప్పటి వరకూ తన కవల సోదరునిగా మెలిగిన అవతలి భాగం

చేస్తున్నదేమిటో, దానివల్ల తనకు కలుగుతున్న ప్రయోజనమేమిటో ఆలోచించే అవసరం లేని రెండు శరీర భాగాలూ మొట్టమొదటి సారిగా స్వీయ సామర్థ్యాన్ని చాటుకోవటం మొదలు పెట్టాయి. శరీరంలో తమదే అత్యంత ప్రాధాన్యం ఉన్న అంగమని చెప్పుకోవటం ప్రారంభించాయి. చేతులు తమ నాజూకైన వేళ్ల వంక మురిపెంగా చూసుకొని మురిసిపోయాయి. పొట్టిగానూ, మందంగానూ కనిపించే పాదాలను చూసి ఎకసెక్కం చేసాయి. ఈ మాటలకు పాదాలు చిన్న బుచ్చుకోలేదు. పల్చగా, సన్నగా కనిపించే వేళ్లు రోగిలా, బలహీనంగా ఉంటాయని వ్యంగ్యంగా వ్యాఖ్యానించాయి.



రోజుల తరబడి ఈ వాదనలు కొనసాగాయి. కలసి సమన్వయంతో పనిచేసే వాటి సహజ స్వభావానికి విరుద్ధంగా ఉండడంతో అవి పని తీరుపైన తీవ్ర ప్రభావం చూపాయి. ఆధిపత్యపోరులో తనదే పై చేయి కావాలన్న పట్టుదల... చివరికి ఎవరో ఒకరు మధ్య వర్తిత్వం వహించి తీర్పు చెప్పమనే దాకా వెళ్లింది.

“ఇద్దరి మధ్యా పోటీ పెట్టి వారిలో ఎవరు గెలిస్తే, వారే విజేత కింద లెక్క” అంటూ సూచించింది నాలుక.

“అద్భుతమైన ఆలోచన” మెచ్చుకున్నారంతా “పోటీ ఎలా?” మళ్లీ సందేహం తలెత్తింది. మల్లయుద్ధం, కత్తి యుద్ధం, రేసింగ్, లేదంటే చెస్, చైనీస్ చక్కర్...” ఇలా రకరకాల ప్రతిపాదన లొచ్చాయి.

ఒకపోటీ చేతులకు అనుకూలంగా ఉంటే కాళ్లకు ప్రతికూలంగా ఉంది. అలాగే కొన్ని పోటీలు కాళ్లకు అనుకూలంగా, చేతులకు ఇబ్బంది కరంగా ఉంది. మీకీ చర్చలు, వాదోపవాదాలూ మామూలే. చివరికి నాలుక చేసిన సూచన అందరికీ నచ్చింది. నదికి సమీపాన ఉన్న అడవిలో పోటీకి రంగం సిద్ధమైంది. బలాబలాలు తేల్చుకోటానికి కాళ్లు చేతులు తయారయ్యాయి.

ఈ పోటీవల్ల తమకు ఎలాంటి ప్రమాదం ముంచుకొస్తుందోనని ఇతర శరీర భాగాల్లో కలవరం మొదలయ్యింది. కళ్లు నిశితంగా తమ చూపు సారించగలిగినంత మేరకు దృష్టి పెట్టి తీక్షణంగా చూడడం మొదలు పెట్టాయి. చెవులు సూక్ష్మమైన ధ్వనిని పసిగట్టడానికి సిద్ధమయ్యాయి. కళ్లు చూడలేని, చెవులు వినలేని అనుకోని ఉత్పాతమేదయినా ఎదురయితే గట్టిగా అరవాలని, ప్రమాదాన్ని పసిగట్టి గట్టిగా కేకలు పెట్టాలని తీర్మానించుకుంది నాలుక. ముక్కు కూడా తన రెండు ముక్కుపుటాలను శుభ్రం చేసుకుని వాసనను పసిగట్టడానికి తయారైంది. అడవి నాలుగు చెరగులా ఈ వార్త వ్యాపించింది. గాలి, నీరు అన్న తేడా లేకుండా అన్ని జీవజాతులకి సమాచారం చేరింది.

సింహాలు, తోడేళ్లు, హైనాలు, ఏనుగులు, ఒంటెలు, జిరాఫీలు, పెద్ద కొమ్ములున్న ఆవులు, చిన్న కొమ్ములున్న దున్న పోతులు, లేళ్లు, జింకలు, ఎలుకలు గుంపులు గుంపులుగా ఒక చోటికి చేరాయి.

చేపలు, హిప్పోలు, మొసళ్లు లాంటివి నీళ్లలో నుంచి బయట కొచ్చి ఏం జరుగుతుందో చూడాలన్న ఆత్రాన్ని ప్రదర్శించాయి.

రెండు కాళ్ల పక్షులు, నెమళ్లు, నిప్పుకోళ్ళు, గైనాపోల్ లాంటివి సంతోషంతో రెక్క విప్పి ఆడాయి. చెట్లపై నున్న పక్షులు కిలకిలా రావాలు చేశాయి. కోయిల పాట అందుకుంది.

సాలీళ్లు, పురుగులు, ఇతర క్రిమికీటకాలు చెట్లపైన, నేలపైనా అటూ ఇటూ వేగంగా కదలడం మొదలు పెట్టాయి. బల్లులు తమ సహజ ప్రవృత్తితో రంగులు మార్చుతూ ఊసర వెల్లులూ పరుగులు తీశాయి. ఇక కోతులు, చింపాంజీలు, గొరిల్లాలయితే చెప్పనే అక్కర్లేదు ఒక కొమ్మ మీద నిలబడ కుండా ఆ కొమ్మ నుంచి ఈ కొమ్మకు ఈ కొమ్మ నుంచి ఆ కొమ్మకు దూకటం మొదలుపెట్టాయి. చెట్లు, కొమ్మలు, పొదలు తలలు ఊపుతూ తమ సంతోషాన్ని ప్రకటించాయి.

పోటీ ప్రారంభమైనట్లుగా
నాలుక పాటందుకుంది
అది పూర్తి కాగానే చేతులు, కాళ్లూ
నిబంధనలన్నీ తమకు సమ్మతమేనని,
ఫలితం ఎలాంటిదైనా అంగీకరిస్తామని,

నిరసనలు గానీ, ప్రతిఘటనలు గాని ఉండవని ప్రకటించాయి. ఆ మేరకు ప్రమాణం చేశాయి.



ముందుగా గోదాలోకి దిగాయి. చేతులు ఒక చిన్న కలవ మొక్కను నేల మీదకు జార విడిచాయి. కాళ్లు, కుడి, ఎడమ, రెండు విడి విడిగానూ, ఒక్కటిగానూ దాని పైకి లేవటానికి ప్రయత్నించాయి. ఆ ముక్క కొద్దిగా ముందుకు జరిగిందే తప్ప పైకి లేవడం సాధ్యపడలేదు. కాళ్లు ఒకదానికొకటి గట్టిగా సంప్రదించుకున్నాయి. పట్టుదలగా ప్రయత్నించాయి గానీ ఫలితం లేకుండా పోయింది. ఇది చూసి చేతులు పగలబడి నవ్వడం మొదలుపెట్టాయి. అందాల ప్రదర్శన పోటీల్లో విజేతలు ముందుకు కదిలినట్టు కలప ముక్కను చేతుల్లోకి తీసుకుని వయ్యారంగా నడుస్తూ- చిరునవ్వులు చిందిస్తూ చివరికి ఆ కలప ముక్కను దూరంగా ఎక్కడికో విసిరేశాయి. అక్కడున్న వారంతా హర్షధ్వానాలు చేశారు.

ఆ తర్వాత తమకున్న ప్రత్యేక సామర్థ్యాన్ని ప్రదర్శించాయి. బియ్యంలో నుంచి అలవోకగా రాళ్లు ఏరివేయటం, సూదితో కుట్టడం, బలమైన దుంగ లాగేందుకు ఇనుప పుల్లీ తయారు చేయటం లాంటివి అందరినీ ఆకట్టుకున్నాయి. అవి అటూ ఇటూ వేగంగా కదులుతూ పనులు చేస్తుంటే అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. కేరింతలతో తమ సంతోషాన్ని ప్రకటించారు. కాళ్ళు బేలగా ఇదంతా చూడసాగాయి. వాటి మునివేళ్లు ఇసుకలో కదులుతూ తమ ఆలోచనలకు పదును పెట్టసాగాయి.

ఇప్పుడు కాళ్ల వంతు వచ్చింది. చేతులు శరీరాన్ని కదిలిస్తే చాలు. సర్కిల్లో ఈ వైపు నుంచి అటు వైపుకి వెళ్లాలి. అదీ పోటీ అని ప్రకటించాయి.

ఏమిటి చెత్త పోటీ అని చేతి వేళ్లు మొదట అపహాస్యమాడినా ఆ తర్వాత వాటికి తెలిసొచ్చింది అదెంత కష్టమైన పనో!

ఆ దృశ్యం చూసి తీరవలసిందే. శరీరంలో భాగమంతా నేలపైన ఒరిగిపోయింది. చేతులు భూమికి తాకాయి. కళ్లు నేలకి సమీపాన ఉన్నాయి. అవి భూమ్మీద కొంత దూరం తప్ప మరేమీ చూడలేకపోయాయి. ముక్కులోకి దుమ్ము ధూళి ప్రవేశించింది. ఉక్కిరి బిక్కిరయింది.

కాళ్లూ దాని వేళ్లూ కేరింతలు కొట్టడం ప్రారంభించాయి. చేతుల వంక పరిశీలనగా చూశాయి.

కొద్ది నిముషాల క్రితం అద్భుత ప్రతిభాపాటవాలు చూపిన చేతులు ఒక్క అడుగు కూడా కదపలేని పరిస్థితుల్లో ఉన్నాయి. చేతుల్లో నొప్పి పెట్టి బాధతో విలవిల లాడుతూ కొద్దిగా కదలగానే మోచేయి ప్రతిఘటించటం మొదలు పెట్టింది. శరీరం పడిపోతోంది. కాసేపు విశ్రాంతి తర్వాత మళ్లీ ప్రయత్నిస్తే ఇదే ఫలితం. వేళ్లను కొద్దిగా జరిపి పట్టుకోసం ప్రయత్నించినా బొటన వేలు తప్ప మిగిలింది కదలటం లేదు. కాళ్లు సాయానికి రానిదే శరీరాన్ని కదిలించటం అసాధ్యమని అర్థమౌతుంది. నిస్సహాయంగా చూస్తుండిపోయాయి.

ఇప్పుడు ఆనంద పడడం కాళ్ల వంతయింది. శరీరం కింద పడకుండా అవి వేగంగా పరిగెత్తాయి. లాంగ్ జంప్, హై జంప్, లాంటివి చేశాయి. ఎగిరి గంతులేశాయి.

ఇదంతా చూస్తున్న కళ్ళు ఆనందంతో వంత పాడాయి.

అయితే ఆ సమయంలో అందరూ ఓ విషయాన్ని గుర్తించారు. చేతులు శరీరాన్ని మోస్తున్న సమయంలో బొటన వేలు మిగతావాటికంటె కొంచెం దూరంగా కదులుతుంది, దీనివల్ల చెయి శక్తి తగ్గుతోంది. నేల మీద పట్టు పెంచుకునే ప్రయత్నంలో మోచేయి నుంచి అందవలసినంత సహకారం రావడం లేదు.

విజేతలెవరనేది తేల్చటం సాధ్యపడలేదు. మళ్లీ వివిధ శరీర అంగాల మధ్య చర్చోపచర్చలు సాగాయి. కాని ఫలితాన్ని ప్రకటించటం మాత్రం సాధ్యపడలేదు.

ఒక్కొక్కటి ప్రతిభావంతమైనవే గానీ... అన్నీ కలిసి ఉన్నప్పుడంత కావు. ఒకదాని సాయం లేనిదే మరొకటి ఏం చేయలేవు అని గుర్తించాయి. చేతులు, మోచేతులు, భుజాలు, అరచేయి, చేతి వేళ్లు ఆసరా లేనిదే ఏ పనీ చేయలేవు. కాళ్లూ అంతే మరి శరీరమేమిటి? అన్న ప్రశ్న ఉత్పన్నమైంది.

వేదాంత ధోరణిలో...

ఇవన్నీ కలిసి ఉంటేనే శరీరం...

అన్ని అంగాలూ పరిపూర్ణంగా పని చేస్తేనే శరీరం సుజావుగా సాగేదని తేల్చారు.

భవిష్యత్తులో మళ్ళీ ఇలాంటి పోటీలు, ఆధిపత్య పోరాటాలకు ఆస్కారం లేకుండా కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు.



ఏకగ్రీవంగా దీన్ని అందరూ కలిసి ఆమోదించారు.

దీని ప్రకారం...

శరీరం నిట్టనిలువుగా కాళ్లు నేలపైన చేతులు గాలిలో వేలాడే విధంగా ఉండాలని నిర్ణయం తీసుకున్నారు. అలాగే కాళ్లకు, చేతులకు మధ్య పని విభజన చేశారు. శరీరాన్ని గమ్యం చేరే వరకూ నడిపించటం కాళ్ల విధి. ఆ తర్వాత అక్కడ చేయవలసిన ఇతర పనులు వస్తువులు ఎత్తటం, పట్టుకోవడం లాంటివన్నీ చేతులే చేయాలి. బరువు మోస్తూ కాళ్లు తమ పని చేస్తున్నా, చేతుల నుంచి ఇతర సహకారం అందుతుండాలి. అవసరాలను ఎప్పటికప్పుడు అది గమనిస్తుండాలి. ఆహారాన్ని నోటికి అందించాలి. పళ్లు ఆహారాన్ని నమలాలి. లేదా మింగాలి అక్కడ్నించి దాన్ని పొట్టలోకి పంపాలి. పోషకాలను అది గ్రహించి వృధా పదార్థాన్ని జీర్ణమయ్యాక విసర్జించేలా చేయాలి. విసర్జించదాన్ని అక్కడే గుట్టగా ఉంచొచ్చు లేదా భూమిలో పాతేయవచ్చు. చెట్లకు మంచి పండ్లు వచ్చినప్పుడు చెయ్యి వాటిని కోసి నోటికి అందిస్తుండాలి. ఇదీ ఒడంబడిక.

ఆటపాటలకి సంబంధించి కూడా వాటి మధ్య ఒప్పందం కుదిరింది. నవ్వులు, పాటలు, మాటలు లాంటి పనులను నోటికి అప్పచెప్పి పరుగు పందాలు, సాకర్ లాంటివి చేతికి, అప్పగించారు. బేస్‌బాల్, బాస్కెట్‌బాల్ లాంటి క్రీడలు చేతులు, కాళ్ళు రెండూ తమతమ బాధ్యతలు నిర్వర్తించి పూర్తి చేయాలని చెప్పారు.

శరీరంలో స్పష్టమైన పని విభజన ఇతర జీవరాశులలో అధికారాన్ని ప్రదర్శించేలా, అద్భుతమైన ఫలితాలను సాధించేలా రూపొందించారు.

అయితే, అప్పుడప్పుడు శరీర భాగాల మధ్య ఆధిపత్య పోరు తలెత్తే అవకాశం లేకపోలేదని భావించారు. శరీరంలో అన్నింటి కంటె పై నుండే శిరస్సు తను అన్నింటి కంటె ముఖ్యమైన భాగాన్నని, నేలకి తాకే పాదాలు మిగలిన వాటికంటె అధమమైనవని భావించి విఱ్ఱవీగవచ్చా? –

ఎట్టి పరిస్థితుల్లోనూ శిరస్సే కాదు మిగిలిన శరీర భాగాలన్నీ సమానమైనవని, దేనికవే శక్తి వంతమైనవని స్పష్టం చేశారు. శరీర బాగాల్లో సంతోషాన్ని గానీ, దుఖాన్ని గానీ అందరూ సమంగా అనుభవించాలని, చెప్పటమే కాదు నోటి ద్వారా ఆ విషయాన్ని అందరికీ ప్రచారం చేయాలని సూచించారు.

అంతే నోరు పాటందుకుంది.

"మా శరీరంలో సేవకుల్లేరు
మా శరీరంలో సేవకుల్లేరు
మేము ఒకరికొకరం సహకరించుకుంటాం
మాకోసం మేం పని చేస్తాం
ఆరోగ్యవంతమైన శరీరాన్ని నిర్మించుకుంటాం
కలిసి కట్టుగా పని చేస్తాం
ఆరోగ్యవంతమైన శరీరాన్ని నిర్మించుకుంటాం
సమిష్టి తత్త్వం మా బలం...
సమిష్టి తత్త్వం మా బలం... అదే మా ఆయుధం..."

చివరిది శరీర గీతంగా మారిపోయింది. ఈ రోజుకీ శరీర భాగాలన్నీ ఇదే గీతాన్ని ఆలపిస్తున్నాయి. జంతువులకీ తమకీ మధ్య ఉన్న తేడాను మానవ శరీరం నిరూపించుకుంటూనే ఉంది. విప్లవాత్మకమైన మార్పునకు నాంది పలికింది.

ఈ పరిణామాలన్నింటికీ ప్రత్యక్షంగా చూసినా నాలుగు కాళ్ల జంతువులు తమ అలవాట్లను మార్చుకోలేదు. వాటి నోరు తినడానికి తప్ప పాడటానికి పనికి రాకుండా పోయింది. అంతేకాదు ఇతర శరీర భాగాలూ తమ పాత అలవాట్లకే పరిమితమైపోయాయి.

మానవుడు పాఠం నేర్చుకున్నాడు. తమ శరీరంలో వివిధ భాగాల ప్రాధాన్యతను గుర్తించాడు. శరీరానికి, శిరస్సుకు నడుమ అప్పుడప్పుడు సంఘర్షణ తలెత్తినప్పుడు, మార్పుకు అంగీకరించని నాలుగు కాళ్ల జంతువుల తీరుగా వ్యవహరిస్తున్నావని గుర్తించి తనను తాను దిద్దుకుంటున్నాడు.

❋

# నా రహస్యమందిరంలో...

- లోసారి సుధాకర్
9949946991



యేళ్ళుగా సముద్రపు ఒడ్డున నిల్చున్నాను
నాలుగు మాటలైనా మాట్లాడదామని
ఓ కరచాలనమై పులకిద్దామని
వెన్నెల రాత్రుల్ని పెదవులుగా చేసుకొని
కెరటాల్నైనా ముద్దాడదామని
ఎంతగా ఎదురు చూశానని
తనువంతా ఓ కన్నుగా మార్చుకొని
దీని రహస్య మందిరంలో దూరి
సత్యాల్ని శోధిద్దామని
స్వప్నాల్ని లెక్కిద్దామని
అంత: మర్మాలని వెలికితీద్దామని
ఎంతకీ అర్థంకాదు కదా!
ఓరగా నైనా నా వైపు చూడదు
ఎంత సౌందర్యం నాది
ఎంత సౌశీల్యం నాది
ఐనా తన భాష తనది
విసిగి నే వెనుతిరిగాను

అప్పుడేమో నా వెనకే
నా నీడలా వచ్చి
రహస్య మిత్రుని కరస్పర్శలా
నా చేతి మణికట్టు వద్ద ప్రేమగా పట్టుకొని
చూపుడువేలు నావైపు చూపింది
నాలోని భయాలు, సందేహాలు
నిర్లక్ష్యాలు, నిర్లజ్జపు సమయాలు
అంతులేని చీకటి పార్శ్వాలు
ఈర్ష్యా ద్వేషాలు
రగులుతున్న హింసాగ్నులు

విశృంఖలత్వపు మోహావేశాలు
కాంక్షల కోరలు, కొమ్ములు
మృగాలు ఘీంకారణ్యాలు
ఇపుడు సముద్రం నా వొడ్డున నిల్చుని
నాలోకి చూస్తుంది..

❋

---

# కన్నీటి చుక్క శబ్దం

- వైష్ణవి శ్రీ
8977237345



పరధ్యానంలో ఉన్నప్పుడు
ప్రపంచం
దానికదే !
రెక్కలొచ్చి ఎగిరిపోతుంది.

అంతే కాదు
దానికదే !
రెక్కలు ముడుచుకు వాలిపోతుంది.
పరధ్యానానికేం తెలుసు ?

రెక్కలొచ్చి ఎగిరినప్పుడు
రాలిన శబ్దం

రెక్కలు వాల్చినప్పుడు
రాల్చిన నిశబ్దం

ఓ క్షణం పరధ్యానం చెదిరితే గానీ ! వినపడదు

గుక్కపెట్టి ఏడుపు లంకించుకున్న కాలింగ్ బెల్
రాల్చిన చివరి కన్నీటి చుక్క శబ్దం

❋

# పక్కకు ఒత్తిగిలితే... కవిత్వ పరిమళం




- కెంగార మోహన్
9493375447

ఇటీవల తెలుగు సాహిత్యంలో వస్తున్న కవిత్వంపై కొంత తృప్తి, మరికొంత అసంతృప్తి సాహిత్యాభిమానుల్లో ఉన్నమాట వాస్తవమే. చలం చెప్పినట్టు కవిత్వాన్ని తూచే రాళ్ళెవరి దగ్గరా లేకపోయినా వివిధ పత్రికల్లో వస్తున్న కవితల్ని లోతైన దృష్టి కోణంతో చదివినపుడు చిక్కదనం లేని కవిత్వం, అలాగే వస్తువులోనూ, శిల్పంలోనూ, కవితా ఎత్తుగడల్లోనూ ప్రారంభ ముగింపుల్లోనూ పేలవంగా కొన్ని కవితలుంటున్నాయి. కవితని ఇలాకూడా రాస్తారా? అని ఒక్కోసారి అనిపిస్తుంది. ఏది రాసినా కవిత్వమే అనుకుంటే సరిపోదు. అచ్చయిన ప్రతీ కవిత గొప్ప కవితనుకుంటే అది మనకుమనం మోసం చేసుకున్నవారమే. ముఖస్తుతికో, పొగడ్తకో బాగుంటుందని ప్రశంసిస్తే ఆ కవి పట్ల మనకున్నది అభిమానమనుకోవటానికి వీల్లేదు. కవిత్వము ఇలాగే ఉండాలన్న నిబంధనలేమి లేకపోయినా కొన్ని మౌలిక సూత్రాలు కవులు అనివార్యంగా పాటించాలి. అలా కొన్ని కవితా నియమాలు పాటించి అక్షరీకరించిన కవిత్వం పది కాలాల పాటు మిగుల్తుంది. అలాంటి కవులే, అటువంటి కవిత్వమే సామాజిక మార్పు దిశగా మనషిని మానవ సమూహాన్ని నడిపిస్తుంది. కవిత్వమంటే ఇలా వుండాలి, అనిపించే కవిత్వాన్ని చదవడంలో భాగంగా కనిపించిన గొప్ప కవిత్వం ఇటీవల కె.శివారెడ్డి రాసిన "పక్కకు ఒత్తిగిలితే". గొప్ప కవుల కవిత్వమెవరైనా గొప్పగానే చెబుతారని చాలా మంది అనుకున్నా ఆ కవిత్వంలోని వస్తు వైవిధ్యం ప్రసిద్ధ కవులను, వర్ధమాన కవులను ఆకట్టుకుంటుంది.

ఆయన కవిత్వం చదివినపుడు ప్రసిద్ధ ఆంగ్లకవి వర్డ్స్ వర్త్ చెప్పిన మాట **It takes its origin from emotion recollected in tranquality** గుర్తొస్తుంది. ప్రబలమైన అనుభూతుల ప్రవాహమే కవిత్వమన్న ఆ మాట కె.శివారెడ్డి కవిత్వంలో కనిపిస్తుంది. కవిత్వపు అంతుచూద్దామనుకుని నగరానికి బయల్దేరి కవిత్వం రాసిన కవి శివారెడ్డి. అరవై డెబ్బై దశకాల్లోనే గొప్ప కవిత్వాన్ని పాఠకులకందించాడు. అప్పుడు రాసిన కవిత్వానికి, ఇప్పుడు రాస్తున్న కవిత్వానికి తేడా లేదు, అదే స్పృహ, అదే చైతన్యం. అప్పట్లోని కవిత్వాన్ని ఒకసారి పరిశీలించినపుడు...

*"దు:ఖాన్ని మాత్రం పిలవకు/ అది దరిద్రం కన్నా/ దరిద్రాతి దరిద్రమైంది/ నిస్తేజమైన/ నిర్వీర్యపుటాలోచనల్ని పోగు చేస్తుంది/ మంటలు సృష్టించలేదు."*

కవిత్వంలో గొప్ప అనుభూతి, లోతైన దృష్టి, స్పష్టంగా అగుపిస్తుంది. కవిత్వం చదువుతుంటే మదిలో భావచిత్రం దానంతటదే గీసుకుపోతుంది. అటువంటి కవిత్వం రాస్తారు. ఆయన సాహిత్య పరిణామ క్రమంలో భాగంగా కె.శివారెడ్డి కవిత్వ క్రమాన్ని పరిశీలిస్తే రక్తం సూర్యుడు(1973), చర్య(1975), ఆసుపత్రిగీతం(1976), నేత్రధనుస్సు(1978),

భారమితి(1983), మోహనా! మోహనా!(1988), అజేయం(1994), నా కలల నది అంచున(1997), వర్షం వర్షం(1999), వృత్తలేఖిని(2003),అంతర్జనం(2002), అతను చరిత్ర(2005), పొసగనివన్నీ(2008), గగనమంత తలతో..(2010)తో పాటు ఇటీవల పాఠకుల ముందుకొచ్చిన పక్కకు ఒత్తిగిలితే...కవితాసంపుటి.

**"ఆకాశం నుండి చినుకు రాలుతుంది/ కనుగవతో పట్టుకో/ ఒక తల్లి ఒడిలో నుంచి బిడ్డ జారుతుంది/ కింద పడకముందే అందుకో/ గుండెల్లో అదుముకో ( నాకింత స్థలం కవితలో...).**

అందుకే శివారెడ్డి కవిత్వం ఉత్తేజాన్నిస్తుంది. స్ఫూర్తినిస్తుంది. కొత్త కవితకు దారి చూపిస్తుంది. ఆయన కవితా శీర్షికలే భిన్నంగా వుంటాయి. వస్తు పరిశీలన, ఆలోచనా తీవ్రత, మనోవికారము, ఊహ, కల్పన, సృజనాత్మక గుణము, ఔచిత్యవిచారము ఉండాలంటాడు. అవొక్కటేనా అంటే వాటితో పాటు ఎత్తుగడలు, శిల్పవైవిధ్యము, ముగింపు అవసరమే. ఇవన్నీ కె.శివారెడ్డి కవిత్వంలో కనిపిస్తాయి. ఈ కవిత చూడండి....

*మాట్లాడాల్సిన వాళ్ళు/ మాట్లాడకపోవడం ఒక క్రూరత్వం/ పలకరించాల్సిన వాళ్ళు/ పలకరించకపోవడం/ చరిత్ర ముఖం మీద సీల దిగ్గొట్టడం(మాట్లాడాల్సిన వాళ్ళు).*

ఇంతకంటే పదునైన కవిత్వం వుండవచ్చేమో కాని అది కూడా శివారెడ్డి కవిత్వమే అయి వుంటుంది. శివారెడ్డి కవిత్వంలో వొక తడి, వొక ఆర్తి, వొక సైద్ధాంతిక నిబద్ధత కనిపిస్తాయి. పదికాలాల కంటే కవి ముందుండాలంటారు. అది నిజమేనిపిస్తోంది. చెప్పాలనుకున్న విషయాన్ని సూటిగా చెప్పడం ఆయనకు సాధ్యం కాదు. దాన్ని కవితాత్మకంగా చెబటం బాగా అలవాటైంది. అందుకే అంత:దృష్టితో చెబుతాడు. అది మాటైనా కవిత్వమైనా రెండూ ఆయనకొకటే. ***కొంచెం స్వేచ్ఛ గావాలి/ మనిషిని మనిషని చెబటానికి/ పశువుని పశువని చెబటానికి../కొంచెం స్వేచ్ఛ గావాలి/ రెక్కలల్లార్చి గాల్లో ఎగరటానికి.*** పైన చెబినట్టు అభివ్యక్తి, అనుభూతి, ఆవేశం, ఊహాశక్తి, ఆలోచనాశక్తి అన్నీ కనిపిస్తాయి. మాటలు మాట్లాడుతున్నంత సులభంగా ఆయన కవిత్వం వుంటుందని అప్పుడప్పుడూ అనిపించినా అంత:దృష్టి, ప్రాపంచిక దృక్పథం, అపుడే పొదుగు నుండి పిండిన చిక్కటి పాలలా వుంటుంది. పాశ్చాత్య కవుల ప్రభావం శివారెడ్డి కవిత్వంలో వుంటుందని చెబుతున్న కొందరి మాటలకు జవాబని కాదు గాని, దశాబ్దాల క్రితం ఆయన రాసిన ఓ కవితను చూడండి. ఏ పాశ్చాత్యుల ప్రభావం వుందో చెప్పండి.

***"నాకు తెల్సు/ నిన్ను జీవితం చంపేసిందని/ జీవితాన్ని చంపేసిందెవరో కూడా తెల్సు/ ముందు జీవితం చస్తే గాని/ ఆ తర్వాత నిన్నది చంపలేదు..."***

ఈ కవితని ఏ ఆస్కార్ వైల్డో, రస్కినో, జాన్ మిల్టనో, లేదంటో ఏ ఇలియటో రాయలేదు. అసలు సిసలైన తెలుగుకవి శివారెడ్డి రాసిందే. పాశ్చాత్యుల కవిత్వాన్ని ఉపమానాలుగానో, ఉదహరణలుగానో తీసుకొని చెప్పినట్టే చెప్పి తనలోని అలోచనలకు పదునెక్కించి రెండంచుల ఖడ్గంలా కవిత్వంతో దూసుకుపోతారు. **Dream is the Highest point of life/ Action its manifestation** అని చెబుతూ కవితను ఇలా ప్రారంభిస్తారు.

*రేపంటే ఆశ నాకు/ రకరకాలుగా విచ్చుకుంటుందని / క్షుద్ర జీవితానికి అంతం పాడుతుందని/ ఏమి జీవితం అనుకున్న చోటే వెన్నెల కురిపిస్తుందని...(రేపంటే)*

ఆయన కాలంతోనే పోటీ పడతారు. సమకాలీన కవుల్తో పోటీలో నిలుస్తారు. కాదు కాదు గెలుస్తారు. ప్రోత్సహిస్తారు. నాల్గుమాటలు నిండుగా చెప్పి కవిత్వం లోతుల్ని స్పృశిస్తారు. ఎవరి కవిత్వమైనా బాలేదని విమర్శించిన సందర్భాలుండవు. బావుందని అంటూనే ఇలా వుంటే బాగుండాలంటారు. అందుకేనేమో యువకవులు ఆయన కవిత్వం చదివేందుకు ఉవ్విళ్ళూరుతారు. ఆయన కవిత్వం ఎపుడొస్తుందా అని ఎదురుచూస్తారు. బహుశా యువకవుల కోసం రాశాడో మరి కొత్తగా కవిత్వం రాస్తున్న వారికోసం ఇలా రాశాడో చూడండి లా..

*"ఇప్పుడు వాణ్ణి కవిత్వీకరించడం కన్నా/ మహత్తరమయిన పనేమి లేదు నాకు/ ఏది నన్ను నిలబెడుతుందో/ ఏది నన్ను బతికిస్తుందో/ స్థిర చిత్తుణ్ణి చేస్తుందో అదే చేస్తా( ఇపుడు వాణ్ణి)"*

చాలా మంది చెప్పినట్టే ఆయన కవితలు ఆయన కవితా శీర్షికలతోనే మొదలవుతాయి. అది ఆయన కవితా ఎత్తుగడ అనొచ్చేమో. కవిత్వంలో అయనది భిన్నమైన శైలి. కె.శివారెడ్డి కవిత్వం చదివితే ఏళ్ళ నాటి కవితా వైరాగ్యం తిరిగి బుసలుకొట్టి చైతన్యం వైపు నడిపిస్తుంది. కొత్త అక్షరానికి పురుడు బోస్తుంది. ఇది కె.శివారెడ్డి కవిత్వ సారమని అనలేము కాని రేఖామాత్ర పరిచయం మాత్రమే..

❋




# మరో మహాభారతం - మన్య భారతం

- తాటికొండల నరసింహారావు
9885787250

*ఈ వాస్తవ చరిత్ర రంపపితూరీ వీరగాథారత్నం అల్లూరి సీతారామరాజు కంటె ముందుగానే ప్రజలలో వ్యాప్తిచెందిన మత్స్య రాజవంశీకులయిన సింగమరాయుడు, మేదినీరాయుడు అతనికి అండదండలుగా రాజ్యాన్ని శాంతి సౌభాగ్యాల వైపు పయనింపజేసిన చింతూరు వంశపు ఆణిముత్యం ముత్యం నాయకుల వీరగాథా చిత్రణ; ఇది నిజంగా మన కళ్ళెదుట జరిగిన ఒక వాస్తవ గాథ. సిపాయిల తిరుగుబాటు కంటె ముందు జరిగిన చరిత్ర.*

మనకు మహాభారతం తెలుసు. పలనాటి భారతం తెలుసు. ఈ రెండింటిలో ఒకటి ఇతిహాసమయితే, మరొకటి వీరగాథా కావ్యం. రెండింటి సరసన నిలవగలిగిన నవరస భరిత చారిత్రక కావ్యం మన్యభారతం. చారిత్రక వీరగాథా కావ్యం అని ఎందుకంటున్నానంటే పై రెండింటిలోవలె ఈ మన్య భారతంలో దాయాదుల కలహం, రాజ్య విస్తరణ కాంక్షల ఇతివృత్తం కాదు ఇది. ఇది బ్రిటీషు పాలకులను, అదే సమయంలో నిజాం పాలకులను ఎదిరించి వీరోచితంగా పోరాడుతూ, అదే సమయంలో తమ రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలించి ప్రజా హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయిన ఒక ధర్మవీరుడు, ఒక పోరాట యోధుని వాస్తవిక వీరోచిత గాథాకావ్యం ఈ మన్యభారతం. ఇదికూడా పద్దెనిమిది పర్వాలుగా విభజించి వ్రాయబడింది.

ఈ వాస్తవ చరిత్ర రంపపితూరీ వీరగాథారత్నం అల్లూరి సీతారామరాజు కంటె ముందుగానే ప్రజలలో వ్యాప్తిచెందిన మత్స్య రాజవంశీకులయిన సింగమరాయుడు, మేదినీరాయుడు అతనికి అండదండలుగా రాజ్యాన్ని శాంతి సౌభాగ్యాల వైపు పయనింపజేసిన చింతూరు వంశపు ఆణిముత్యం ముత్యం నాయకుల వీరగాథా చిత్రణ; ఇది నిజంగా మన కళ్ళెదుట జరిగిన ఒక వాస్తవ గాథ. సిపాయిల తిరుగుబాటు కంటె ముందు జరిగిన చరిత్ర.

ఈ కావ్యంలో వేదినీరాయుడు చరిత్ర నాయకుడయితే, ముత్యం నాయకుడు కథా నాయకుడు. ఈయన మహోన్నత వ్యక్తిత్వం అందుచేతనే మత్స్యభూపతులకు ఆప్తవర్గంలో అత్యంత ప్రముఖ వ్యక్తి అయినాడు. ఈయన పెద్ద మనిషి మహాభారతంలో భీష్మునితో విదురునితో పోల్చదగినవాడు, నీతి, నిజాయితీలకు నిలువెత్తు దర్పణం లాంటివాడు. అందుకే శిఖండి లాంటి మంత్రి అగ్నిశర్మ, అచ్చన్న నాయకుల కుట్రలకు బలి అయినవాడు. ఆయన తరువాత ఆయన కుమారుడు మల్లన్న నాయకుడు పేర్కొనదగినవాడు.

ఈయన బ్రిటిషు ప్రభుత్వంలో ఈ ప్రాంతంలోని మొగళ్ళపల్లి, చింతకుంట, మత్స్యవారి పులిబోయినపల్లి గ్రామాలకు ప్రభుత్వం తరఫున పటేలుగా విధులు నిర్వర్తించాడు. పటేలు అంటే గ్రామాధికారి. ఆయనకు ముగ్గురు కుమారులు. వారు స్వామి, ఎర్రయ్య, బుచ్చిరామయ్య అనేవారు. వీరిలో బుచ్చిరామయ్య గారి కుమారుడు ప్రస్తుత మన్యభారతం కృతికర్త మాల్యశ్రీ కాగా కృతి భర్త ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు.

వీరు ఈ కావ్యాన్ని నవరస భరితంగా రచించారు. సాధారణంగా వీరగాధా కావ్యాలలో శృంగార రసానికి అంత ప్రాధాన్యం ఉండదు కాని మాల్యశ్రీ మన్యభారతంలో శృంగార రసాల్ని కూడా రసాభాస కాకుండా చొప్పించారు. ప్రియదర్శన పర్వంలో యువరాజయిన మేదినీరాయడు అత్యంత కోలాహలంగా జరిగే దంతేశ్వరి మాత ఉత్సవాలకు హాజరవుతాడు. ఆ సందర్భంలో ఆయనకు "మాధవి" అనే అందాల రాశి కనిపిస్తుంది. దరిమిలా ఆమె యువరాణి అవుతుంది. వారి ప్రథమ దర్శనంలో ఆమె రూపాన్ని కనువిందుగా వర్ణించారు.

*ముంగురు లుంగరమ్ములయి ముద్దుమొగమ్మున లాస్యమాడ, సాం*
*రంగ విలోచనమ్ములను రాగములొల్క, సుహాసరేఖలన్*
*పొంగెడి జవ్వనమ్ము ననపొల్చును గుల్కగ, నేవళమ్ము నౌ*
*భంగిమలో చెలంగుచును భాసివె భావర సౌర్థమూర్తియై*

ఈ కావ్యంలో ఇలాంటి పద్యాలు పాఠకులను అలరిస్తాయి. వీరగాధా కావ్యంలో పౌరుష, పరాక్రమాలను వర్ణించడం తప్పనిసరి. సేనా నాయకుడు అచ్చన్న నాయకుని పరాక్రమ వర్ణన.

*అచ్చపు మన్యవీరుడు, మహాబలవంతుడు, యోధమూర్తియో*
*అచ్చన రెచ్చిపోయి య సహాయిల రోహిల బృంద వక్షముల్*
*గ్రుచ్చుచు నీటెవాదరల, గొబ్బున నార్చుచు, క్రోల్బులిన్ వలెన్*
*పిచ్చిగ, పచ్చిగ విలయ విస్ఫుర తాండవకేళి సల్పెడున్*

ఈ పద్యంలో ఒక వీరుని పరాక్రమ తాండవకేళి పిచ్చిగ పచ్చిగ రెచ్చిపోవడం, వైరి వీరుల వక్షములందు బాకులు గ్రుచ్చుకోవడం ద్విత్వచవర్ణంతో వర్ణించడం చేయి తిరిగిన కవులకే చెల్లు హాస్యరసవర్ణనకు ఒక మచ్చు, మెచ్చుతునక. శాతికర్ణి అనే ఒక శిల్పి ఒక మరకుందేలును తయారుచేసి దానికి ఉన్న గొలుసు త్రిప్పి ప్రేక్షకుల మధ్య వదిలితే వారంతా ఆశ్చర్యంగా చూడటం ఈ పద్యంలో ఉంది.

*దాచిన కఱ్ఱకుందెలును తట్టునదీసెను శాతకర్ణియున్*
*కొలునుద్రిప్పి కుందెలును ఖేలగవైచెను దండుబీటిలో*
*లీలగ పర్వుదీసి యువలీలగ గంతులువేసి దవ్వగన్*
*గాలి జవంబు పోలెనది గ్రక్కున పర్వగ, ప్రేక్షకాళియున్*
*ఈలలు వేయుచున్నదియు నేగిన బాటనె యేగిరందరున్*

ఇలా చెప్పుకుంటూపోతే ఇదే ఒక గ్రంథమవుతుంది. ఇక్కడ ఒక విషయం ఈ కావ్యంలో వ్రాయనిది ఒకటుంది. సాధారణంగా వీరగాధా కావ్యాలు విషాదాంతం అవుతాయి. కాని రచయితకు విషాదాంతం చేయడం ఇష్టంలేక ఈ ఉదంతాన్ని గ్రంథస్థం చేయలేదు. ఆ లోటును ఆచార్య తంగిరాల వారు తీర్చారు. వారి మాటలలోనే చెప్పారు. అదే మేదినీ రాయని మరణం. శత్రువుల వెన్నుపోటుకు గురై వీర మరణం చెందిన ఘట్టం వీరు స్పృశించలేదు. అయినా ఈ కావ్యానికి ఏ విధమైన లోటూ రాదు.

1857 ప్రాంతంలో భారతదేశంలో ఆంగ్లేయ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అసంతృప్తి జ్వాలలు రగులుతున్న సమయంలో ఆంగ్లేయ నిజాం ప్రభుత్వాలు ఒకసారి యేది నీ రాయడిని చాందాకోటకు ఆహ్వానించి అక్కడ బంధించాయి. ఆయన అక్కడ కొంతకాలం బందీగా ఉండి కాపలా భటులను తప్పించుకొని గుర్రంతో సహా కోట గోడ దూకి ఎవరికీ చిక్కకుండా శీఘ్రంగా చెర్లకోటకు చేరుకుంటాడు.

మరికొన్నాళ్ళకు బ్రిటిషువారి పింగాణీ, గాజు సామానుల వర్తకులుగా వచ్చి ఆయనకు బహుమతులుగా ఇస్తూ, నమ్మించి ఆయనను స్టీమరు ఉన్నచోటుకు అబ్బరాజు బండ గోదావరి రేవుకు ఆహ్వానించి, బంధించడానికి ప్రయత్నించగా ఆయన వారితో కత్తిసాము చేసి కొందరిని చూపి, శత్రువుల వెన్నుపోటుకు గురై వీరమరణం చెందుతాడు. మేదినీ రాయడు. ఆయన శిరస్సు ఖండించి తమతో తీసుకుపోయారు శత్రువులు. దానితో చర్ల రాజ్యప్రభ అంతరించింది.

19వ శతాబ్ది ఉత్తరార్థంలో ఉత్థాన పతనాలను చవిచూసి చరిత్రలో నిలచిపోయిన చర్లకోట కథ నాటికీ. నేటికీ, ఏనాటికీ వీరగాధా చారిత్రక కావ్యాలలో మొదటి మెట్టులో నిలబడుతుంది. దాన్ని ప్రజలకందించిన ముత్యం నాయకుని వంశాంకురం మాల్యశ్రీ గ్రంథస్థం చేయడం ముదావహం. కవి వాక్కుగా ఆయన వచించిన వాక్కు.

*ముత్యమునకు ముని మనుమడ*
*సత్యమునకు కథను వ్రాసి చాటితి నిలపై*
*నిత్యంబుగ వెలుగొందుత*
*స్తుత్యంబై దనరుగాక సొంపారుచునున్*

ఇది సత్యవాక్కు. ఈ కావ్యాన్ని అందరూ చదివేటట్లుగా వ్రాసిన మాల్యశ్రీ అభినందనీయుడు.

❋

# మాతృభాషా మాధ్యమ వేదిక ఆధ్వర్యంలో విజయవాడలో ఫిబ్రవరి 19న ఒక రోజు నిరాహార దీక్ష

**మాతృభాషా మాధ్యమ వేదిక ఒకరోజు నిరాహార దీక్షకు మేధావులను, రచయితలను, విద్యావేత్తలను, భాషోద్యమకారులను ఆహ్వానిస్తూ వితపు బాలసుబ్రహ్మణ్యం(9490098912), ఎస్.ఆర్. పరిమి (9490635846), డా॥ సామల రమేష్‌బాబు (9848016136), డి.రమేష్ పట్నాయక్ (9440980396), ప్రొ॥ గారపాటి ఉమామహేశ్వరరావు (9866128846) సంయుక్తంగా వేదిక తరపున ఈ దిగువ ప్రకటన విడుదల చేశారు.**

***ప్రాథమిక విద్యలో రాష్ట్రమంతటా మాతృభాషే మాధ్యమంగా ఉండాలి. పురపాలకశాఖ వారి జి.ఒ.నెం.14/ ఫిబ్రవరి 2017ను పూర్తిగా రద్దు చెయ్యాలి. ఫిబ్రవరి 19న విజయవాడలో నిరసన దీక్షలో పాల్గొనండి..***

మాతృభాషా మాధ్యమ వేదిక పిలుపు

పాలకులు ప్రజలభాషలను దినదినానికి అధోగతి పట్టిస్తున్నారు. భారత రాజ్యాంగ స్ఫూర్తితో, విద్యాహక్కు చట్టం 5వ విభాగం 29(2)లో పొందుపరచిన లక్ష్యాలను (ముఖ్యంగా మాతృభాషా మాధ్యమం గురించి) నెరవేర్చవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వం మీద ఉండగా, వాటిని నెరవేర్చకపోగా, పిల్లల వికాసానికి గొడ్డలిపెట్టుగా పరిణమించే ఆంగ్లమాధ్యమాన్ని ప్రాథమిక స్థాయినుండే ప్రవేశపెట్టాలనుకోవడం గర్హనీయం. 1980 నుండి విజృంభిస్తున్న ప్రైవేటు ఆంగ్లమాధ్యమ పాఠశాలలు దురదృష్టకరమైన ఆంగ్లవ్యామోహాన్ని సృష్టించాయి. ప్రజా ఉద్యమాలు వ్యాపార రంగంలో విద్యను, ఆంగ్లమాధ్యమాన్ని నిరసించినా, నిలువరించలేకపోవడం వలన అశాస్త్రీయమైన, అప్రయోజకరమైన, అనర్థదాయకమైన ఆంగ్లమాధ్యమం ఒక మహమ్మారిగా తెలుగు సమాజాన్ని ఆవహించింది. 2006లో వచ్చిన 76 జి.వో.ద్వారా ప్రభుత్వరంగ ఉన్నత పాఠశాలలలో ఆంగ్లమాధ్యమాన్ని సమాంతరంగా ప్రవేశపెట్టారు. 2014లో విడుదల అయిన జి.వో.53 ద్వారా అన్ని ప్రభుత్వ ఉన్నత పాఠశాలలలో తెలుగు మాధ్యమాన్ని పూర్తిగా ఎత్తివేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఉద్యమాల వత్తిడివలన ఆ ప్రయత్నం తాత్కాలికంగా ఆగింది. ఈ సంవత్సరం జనవరి 2న పురపాలక మరియు పట్టణాభివృద్ధి శాఖ విడుదలచేసిన జి.వో.14 ద్వారా మున్సిపల్ పాఠశాలలలో మొత్తం ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత స్థాయిలలో మాతృభాషా మాధ్యమాన్ని పూర్తిగా ఎత్తివేసి ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నం చేశారు. వ్యతిరేకత రావడంతో అమలును వచ్చే సంవత్సరానికి వాయిదావేశారు. ఈ జి.వో.ను మనం వ్యతిరేకిస్తున్నాము. అయితే, ఈ సమస్యను మూలం నుంచే మనం పెకలించవలసి ఉంది. ఇందుకు మనం శాయశక్తులా ప్రయత్నిద్దాం. ఇప్పుడు కాకపోతే మనం ఎప్పటికీ చేయలేం.

తెలుగు భాషోద్యమ సమాఖ్య, విద్యా వికాస వేదిక, ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ ప్రతినిధులు, ఇంకా మరికొందరు విద్యారంగ నిపుణులు జనవరి 20న విజయవాడలో సమావేశమై 'మాతృభాషా మాధ్యమ వేదిక' ను ఏర్పాటు చేశారు. ప్రభుత్వ, ప్రయివేటు పాఠశాలలలో మాతృభాషా మాధ్యమం అవసరమని నమ్మి కృషిచేసేవారు, పరితపించేవారందరితో ఒక నిరసన శిబిరాన్ని, నిరాహార దీక్షను ఏర్పాటుచేయాలని నిర్ణయించారు. దాని ద్వారా ఈ రాష్ట్రంలో మేధావులు ఆంగ్లమాధ్యమాన్ని వ్యతిరేకిస్తున్నారని, మాతృభాషా మాధ్యమాన్ని అమలు చేయాలని కోరుతున్నారని ప్రభుత్వానికి గట్టిగా తెలియజేయాలని తలపెట్టారు. **ఈ శిబిరం ఫిబ్రవరి 19 ఆదివారం విజయవాడలో- అలంకార్ టాకీస్ దగ్గర ధర్నాచౌక్‌లో ఉ.10 గం॥ నుండి సా.5 గం॥ వరకు జరుగుతుంది.** ఈ వేదిక ఆశయంతో ఏకీభవించే సంస్థలు, వ్యక్తులు నిరశన దీక్షలో పాల్గొనవలసినదిగా ఆహ్వానిస్తున్నాము.

**డిమాండ్లు :**

1. అన్ని మునిసిపల్ పాఠశాలల్లో తెలుగు మాధ్యమాన్ని తొలగించి, పూర్తిగా వాటిని ఇంగ్లీషు మాధ్యమంలోకి మార్చుతూ జనవరి 2న ఇచ్చిన జి.వో. నెం.14 ను తక్షణమే రద్దు చెయ్యాలి.

2. ప్రాథమిక స్థాయిలో తప్పనిసరిగా విద్యార్థుల మాతృభాషా మాధ్యమంలోనే విద్యను గరపాలి. ఇది రాష్ట్రంలోని ప్రభుత్వ, ప్రయివేటు యాజమాన్యాల కింద నడుస్తున్న అన్ని పాఠశాలలకు వర్తించాలి.

3. ఉన్నత పాఠశాలలలో మాతృభాషా మాధ్యమాన్ని కొనసాగించాలి. ఆంగ్ల మాధ్యమ విభాగాలను కోరినవారికి నిర్వహించవచ్చు.

4. మొత్తం విద్యారంగంలో ప్రభుత్వ భాషావిధానాన్ని స్పష్టంగా ప్రకటించాలి.

ఉపాధ్యాయులు, కళాకారులతో సహా అన్ని రంగాలలోని మేధావులు, నిపుణులు, రచయితలు, కళాకారులు, భాషోద్యమకారులు అందరూ ఉద్యమంలో పాల్గొనాలని కోరుతున్నాం.

కనీసం ప్రాథమిక విద్యలో మాతృభాషా మాధ్యమాన్ని కాపాడుకోవడానికే ఈ ఉద్యమం.

*ఇది ప్రారంభం మాత్రమే!*

❋

## చౌరవ కవితా సంపుటి



నాగినేని భాస్కరరావు

వెల : 120/- పేజీలు: 160

ప్రతులకు : 9581291736

సమస్యల సుడిగాలిలో చిక్కుకున్నప్పుడు కవిత్వాన్ని ఆక్సిజన్‌గా చేసుకుని అక్షరాల అనుపానంతో జీవిస్తున్న వైద్య కవి డా॥ నాగినేని భాస్కరరావు. ఈ లోకంలో బతుకుతూ కవిత్వం ద్వారా ఈ కాలాన్ని ప్రతిఫలిస్తున్న కవి తిలకుడాయన. ప్రవృత్తి రీత్యా కవిగా కనబడుతున్నా వృత్తిరీత్యా వైద్యుడాయన.

- అనంతం

## నది పలికిన వాక్యం




కవిత్వం

విలాసాగరం రవీందర్

వెల : 100/- పేజీలు: 146

పతులకు : 9440932934

రవీంద్ర విలాసాగరం కవిత్వంలో ఆర్ద్రత, భావుకత, అద్భుతమైన పద చిత్రాలు రసానుభూతిని బస్త్రం కలిగిస్తాయో, ప్రతి వంక్తిలోను ఆలోచనల నెగడుకు నిప్పు పెట్టే అగ్గిరవ్వల్లాంటి అక్షరాలు కూడా మిణుగురుల్లా ఎగురుతూనే ఉంటాయి. ఈ సంపుటిలో వివిధ వస్తువులపై రవీందర్ విలాసాగరం రాసిన కవితలు ఆయన దృష్టి ఎంత విశాలమైనదో తెలియజేస్తున్నాయి.

- కవి యాకూబ్

## ఆవంత్స కవితాభ్యుదయం




అడపా రామకృష్ణ

వెల : 30/- పేజీలు: 40

ప్రతులకు : 9505269091

ఇది చిరు గ్రంథమే కావొచ్చును; చంద్రునికో నూలుపోగు. అవంత్సపై అనురాగంతో చేసిన అక్షరార్చన. ప్రేమతో ప్రచురిస్తున్న పుష్పాలంకరణ... భక్తితో నివేదిస్తున్న మంత్రోపాసన.

- ఆచార్య చందు సుబ్బారావు

## సామా (రేడియో నాటకం)




ఎస్.డి.వి. అజీజ్

వెల : 50/- పేజీలు: 68

ప్రతులకు : 8106367175

వీరు శ్రోతల, ప్రేక్షకుల, ప్రజల నాకట్టుకునే నాటకాలెన్నో రచించారు. వీరు రాసిన నాటకాల్లో అనేక చారిత్రాత్మక నాటకాలు వుండడం విశేషం. వాటిలో 'సామా' నాటకం చాలా ప్రాచుర్యం పొందడమే కాక, ఆకాశవాణి నాటక రచనల పోటీల్లో బహుమతి కూడా పొందింది.

- కళాకృష్ణ

## సంతరావూరు కథలు




తోటకూర వేంకట నారాయణ

వెల : 60/- పేజీలు: 116

ప్రతులకు : 8341586274

ఏ కథకా కథ ప్రత్యేక పాత్రలూ, సంఘటనలూ ఆధారంగా సాధరణీకాన్ని పొందింది. వేంకట నారాయణ గారి శైలి బహుజనామోదశైలి. ఈ కారణాన కూడా ప్రతి కథకీ అద్భుతమైన చదివించే గుణం అబ్బింది. ఇతి వృత్తాలన్నీ వాస్తవాధీన రేఖల్ని అతిక్రమించనివి కావడంతో ఉత్కంఠ భరితంగా మనముందు కొచ్చినై.

- విహారి

## నడక సడలిన వేళ (దీర్ఘకవిత)




ఎస్.ఆర్. పృథ్వి

వెల : 20/- పేజీలు: 24

ప్రతులకు : 0883-2421123

కవిగా ఎస్.ఆర్. పృథ్వి గారు సాహిత్య అధ్యయనం చేసి ఎలారాయాలో, సమాజాన్ని జీవితాన్ని చదివి ఏమి రాయాలో తెలుసుకున్నవారు. బహుగ్రంథకర్త. ఈ మధ్య వీరు రోడ్డు మీద నడుస్తున్నపుడు ఒక మోటార్ సైకిలిస్ట్ గుద్దడం వలన కాలు విరిగి మంచమెక్కారు. స్వీయ అనుభవసారాన్ని అనుభూతుల్లోకి మార్చుకొని ఒక దీర్ఘకవిత రాశారు.

- కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి




# అనంతపురంలో కార్మికసాహిత్యంపై సదస్సు

పి. కుమారస్వామి
9490122229

*అనంతపురంలో సాహిత్య అకాడమీ, సాహితీస్రవంతి సంయుక్తంగా నిర్వహించిన కార్మిక సాహిత్య సదస్సులో ప్రసంగిస్తున్న తెలకపల్లి రవి, చిత్రంలో సింగమనేని నారాయణ, రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, పి. కుమారస్వామి, మేడిపల్లి రవికుమార్, శాంతారావు*

సాహిత్య అకాడమీ, సాహితీ స్రవంతి సంయుక్తంగా కార్మిక సాహిత్యంపై అనంతపురంలో ప్రెస్‌క్లబ్‌లో డిసెంబర్ 15న ఒకరోజు సదస్సు నిర్వహించాయి.

ప్రారంభ సమావేశానికి సాహితీస్రవంతి రాష్ట్ర కమిటి సభ్యులు పిళ్లా కుమారస్వామి అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథులుగా కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి విచ్చేశారు. ప్రసంగకర్తలు సింగమనేని నారాయణ (కార్మికకథలు), మేడిపల్లి రవికుమార్ (కార్మికకవిత్వం) శ్రీమతి సంజీవమ్మ (కార్మిక నవలలు), శాంతారావు (కార్మిక నాటకాలు) వేదిక నలంకరించారు. వీరందరిని వేదికపైకి సాహితీస్రవంతి జిల్లా ప్రధానకార్యదర్శి వల్లెపు రవిచంద్ర ఆహ్వానించారు.

అధ్యక్షత వహించిన పిళ్లా కుమారస్వామి ఆ రోజు జరిగే కార్యక్రమాన్ని సభికులకు వివరించారు. ప్రధానంగా కార్మికుల సాహిత్యం చాలా తక్కువగా ఉందని ఆ లోటును పూడ్చడానికి సాహిత్యకారులు కార్మికులకు సంబంధించి విరివిగా రచనలు చేయాలని కోరారు. కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలు సాహిత్యంలోకి తీసుకురావాల్సిన అవసరం గురించి తెలిపారు. అస్తిత్వవాదాలపై చర్చ జరిగినంతగా కార్మిక సాహిత్యంపై జరగలేదన్నారు. కార్మిక సాహిత్యంపై చర్చ జరిగితే అస్తిత్వవాదాలు వెనుకబడుతాయని ఆయన చెప్పారు.

సాహిత్య అకాడమీ వివిధ అంశాలపై నిరంతరం సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటుందని రాచపాళెం చంద్రశేఖరరెడ్డి వివరించారు. గురజాడ కన్యాశుల్కంలో శ్రమ గురించి అంశాల వారీగా వివరించారు.

తెలకపల్లిరవి ప్రసంగిస్తూ రాజుల కాలంలో రాజులకు సంబంధించిన అంశాలు తప్ప శ్రమజీవుల గురించి ఏ మాత్రం కనిపించదన్నారు. భక్తి సాహిత్యంలో అక్కడక్కడ తమకు తెలియకుండానే శ్రమజీవుల గురించి రాశారన్నారు. పోతన రాసిన భాగవతంలో కొన్ని ఉదాహరణలు వివరించారు. సోవియట్ రష్యాలో కార్మికుల రాజ్యం ఆవిర్భవించాక శ్రామిక జీవితం సాహిత్యంలోకి ప్రవేశించిందన్నారు. 1922లో మాలపల్లి నవలలు, 1934,35 లో వచ్చిన అమ్మ నవల అనువాదం ద్వారా, 1934లో శ్రీశ్రీ రచనలు ద్వారా శ్రామిక సాహిత్యం వెలుగులోనికి వచ్చిందన్నారు.

తరువాత రెండో సెషన్‌లో కార్మికుల కథలపై సింగమనేని నారాయణ ప్రసంగించారు. ఈ సెషన్‌లో సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు ప్రగతి అధ్యక్షత వహించారు. సింగమనేని నారాయణ మాట్లాడుతూ సాహిత్యాన్ని శ్రామికకోణం నుంచి చూడాల్సిన ఆవశ్యకత ఉందన్నారు. మార్క్స్ భావజాలం మూలంగానే శ్రామిక దృక్పథం చాలా మందిలో ఏర్పడిందని, కె. సభా రాసిన కథల్లో ఎక్కువ భాగం వ్యవసాయ కార్మికుల గురించే ఉందన్నారు. మధురాంతకం రాజారాం శ్రమజీవులకు సంబంధించిన అనేక

కథలు రాశారని, తెలంగాణా ప్రాంతం నుంచి చేనేత కార్మికుల, వృత్తిదారుల కథలు విరివిగా వచ్చాయన్నారు. కల్లుగీత, వడ్రంగి, కమ్మరి, కుమ్మరుల కథావస్తువులు వచ్చాయన్నారు.



తరువాత జరిగిన కార్మిక నాటక సాహిత్యం సెషన్‌కు నాటక రచయిత యక్కలూరి శ్రీరాములు అధ్యక్షత వహించారు. ప్రధానవక్త శాంతారావు కార్మిక నాటక సాహిత్యంపై ప్రసంగించారు. శ్రమసాహిత్యం గురించి మాట్లాడాలంటే మొదట వేమన గురించి చెప్పుకోవాలన్నారు. శ్రీశ్రీ నుంచి మాట్లాడుకోవాలన్నారు. శ్రామికులకు సంబంధించి మా భూమి, ముందడుగు నాటకాలు వచ్చాయన్నారు. రక్తకన్నీరు, జగన్నాథరథ చక్రాలు వంటి నాటకాలు ప్రజలను కదిలించాయని, సఫ్దర్ హష్మి నాటకం పూర్తిగా వీధినాటకమని, ప్రజల మధ్యన ఉంటూ ఎలాంటి స్టేజి లేకుండా వేసే నాటకం వీధినాటకమని తెలిపారు. కళాజాతాలు జరిగినపుడు నాటకాలు వేస్తే జనం నాటకంలో పాత్రలతో కలసిపోయేవారని, ప్రపంచీకరణతో జీవితం సంక్షోభ భరితం అవుతున్న వేళ ప్రజలకు ఆత్మస్థైర్యాన్ని ఇచ్చే నాటకం రావాలన్నారు.

ప్రముఖ కవి ఏలూరి ఎంగన్న స్పందనగా కొన్ని నాటకాల గురించి వివరించారు.'పాలేరు, నంది, ముఠామేస్త్రీ' వంటి నాటకాలు శ్రామికుల గురించి రాసినవన్నారు. వాటిని ప్రదర్శించినపుడు ప్రజలు బాగా స్పందించారన్నారు.

మధ్యాహ్నం భోజనానంతరం జరిగిన కార్మిక కవిత్వం సెషనుకు వర్ధమాన కవి నాగేంద్ర అధ్యక్షత వహించారు. డా॥ మేడిపల్లి రవికుమార్, నన్నయ కాలం నుంచి తెలుగు సాహిత్యాన్ని పరిగణనలోకి తీసుకోవడం వల్ల అంతకు ముందున్న సాహిత్యం మరుగునపడి పోయిందన్నారు. నన్నయకు ముందు విశేషమైన జానపద సాహిత్యం ఉందనీ, అందులో శ్రామికుల గీతాలే ఎక్కువగా ఉన్నా వాస్తవానికి ఆ గేయాలను కవిత్వాలుగా శ్రామికులే పాడేవారని, వారే కర్తలు, వార్లకు పేర్లు లేవని, అవి వారి సమిష్టి సంపద అన్నారు. శ్రామిక కవిత్వంపై పెద్దగా పరిశోధన జరగలేదన్నారు. విశ్వవిద్యాలయాలు పట్టించుకోవాలన్నారు.

తదనంతరం 'కార్మిక నవలా సాహిత్యం' పై సభ కొనసాగింది. ఈ సభకు ప్రముఖ కథారచయిత్రి 'శశికళ' అధ్యక్షత వహించారు. ప్రధానవక్త డా॥ సంజీవమ్మ హాజరయ్యారు. ఆమె అక్కినేని కుటుంబరావు రచించిన 'కార్మిక గీతం' శిరంశెట్టి కాంతారావు రచించిన 'వ్యూహం' నవలలపై చర్చించారు. ఇవి రెండూ ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన ప్రధాన నవలలని కార్మిక సాహిత్యం సంబంధించిన నవలలు తక్కువగా ఉన్నాయన్నారు. కార్మికగీతం 'సిటు' (సి.ఐ.టి.యు) సంస్థ ప్రచురించిందని చెప్పారు. వ్యూహం నవల చదివితే కార్మికులు ఇన్ని సమస్యలతో కొట్టుమిట్టాడుతున్నారా? అని బాధ కలుగుతుందన్నారు. నవల ప్రారంభమే ఒక భీభత్స దృశ్యంతో ప్రారంభమవుతుంది. కార్మికుడు నిర్మాణంలో వున్న ఏడు అంతస్థుల టవర్‌పై పనిచేస్తూ పై నుంచి జారి కిందకు పడుతూ కడ్డీలపై బడి దాన్లో ఇరుక్కొని చనిపోయే సంఘటనతో నవల ప్రారంభమవుతుంది. ఆ కార్మికునికి నష్టపరిహార మివ్వడానికి యాజమాన్యం ఒప్పుకోదు. సంఘాలు ప్రవేశిస్తాయి. కొన్ని సంఘాలుగా నటిస్తూ కార్మికులకు ద్రోహం చేస్తుంటాయి. ఒక సంఘం నికరంగా నిలబడి ఆ కార్మికుడి కుటుంబానికి 10 లక్షల రూపాయలు నష్టపరిహారం ఇప్పిస్తారు. ఇలా సాగుతుంది నవల అని చెప్పారు. ఈ నవలలో యజమానుల వ్యూహాలు ఎత్తుగడలు తెలుస్తాయన్నారు.

ఈ సెషన్ తరువాత జనరల్ కార్మిక సాహిత్యంపై తెలకపల్లిరవి మాట్లాడుతూ మార్క్సిస్టు అయితేనే కార్మికుల గురించి రాయగలడని చెప్పడం అంత సవ్యంగా లేదన్నారు. మార్క్సిజం తెలియకపోయినా, మార్క్సిస్టు కాకపోయిన వాళ్ళు కూడా శ్రామిక సాహిత్యం రాశారన్నారు. వివిధ అస్తిత్వవాదాలు చర్చల్లో వున్నా కూడా శ్రామిక సాహత్యం గురించి చర్చలేదన్నారు. విశ్వవిద్యాలయాలు విద్యార్థులచే ఈ దిశగా పరిశోధనలు చేయించటం అవసరమన్నారు. కార్మిక సాహిత్యం రూపొందించటానికి కృషి చేయాల్సిన అవసరం ఉందని చెప్పారు. సాహిత్య అకాడమీ ఇలాంటి వాటికి చేయూత నివ్వడం ఎంతో గొప్ప విషయమన్నారు.

పిళ్లా కుమారస్వామి వందన సమర్పణతో లిటరరీ ఫోరమ్ కార్యక్రమం ముగిసింది.

❋

## 'ప్రేమకు ఆవలితీరం' ఆవిష్కరణ సభ



అంపశయ్య నవీన్ 75వ జన్మదినం సందర్భంగా డిసెంబర్ 24న హనుమకొండలో జరిగిన 'ప్రేమకు ఆవలితీరం' పుస్తకావిష్కరణ. చిత్రంలో విజయనిర్మల, గంట రామారెడ్డి, వావిలాల సుబ్బారావు, అంపశయ్య నవీన్, వరిగొండ కాంతారావు తదితరులు.

ప్రముఖ కథ, నవలా రచయిత అంపశయ్య నవీన్ 75వ జన్మదినం సందర్భంగా డిసెంబర్ 24న హనుమకొండలోని కాకతీయ హరిత హోటల్లో 'ప్రేమకు ఆవలితీరం' పుస్తకావిష్కరణ సభ జరిగింది. పుస్తకాన్ని ఆవిష్కరించిన సాహిత్య పరిశోధకులు వావిలాల సుబ్బారావు 'ఒక నూతన సాహిత్య ప్రక్రియకు నవీన్ శ్రీకారం చుట్టారని, చలం లాంటి ఒక గొప్ప వైతాళికుడి జీవితాన్ని నవలగా రాయటం చాలా కష్టసాధ్యమని, దాన్ని నవీన్ సుసాధ్యం చేశారని' అన్నారు. ఈ సందర్భంగా అంపశయ్య నవీన్ నవలా రచనకు ప్రోత్సాహకంగా ప్రతీ సంవత్సరం అందించే తొలినవల పురస్కారాలను ప్రథమ బహుమతిని వరంగల్‌కు చెందిన వరిగొండ కాంతారావుకు 'సాహచర్యం' కు , ద్వితీయ బహుమతి శీలం విజయలక్ష్మిలకు పురస్కారాలను అందజేశారు. అంపశయ్య నవీన్ రచనల ప్రత్యేక సంచికగా వెలువడిన 'పాలపిట్ట' ను పోలీస్ కమీషనర్ జి. సుధీర్‌భాబు ఆవిష్కరించారు. రామాచంద్రమౌళి, డా॥ పి. ఈదారెడ్డి, నెల్లుట్ల రమాదేవి, స్వప్న, ప్రముఖ సాహిత్యవేత్త గంట రామారెడ్డి, డి. శశికిరణ్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ❋

## విమలాశాంతి సాహిత్య పురస్కార సభ

ప్రముఖ కథ, నవలా రచయిత శాంతినారాయణ స్థాపించిన విమలాశాంతి సాహిత్య పురస్కార ప్రదాన సభ డిసెంబర్ 29న విజయవాడలోని ఘంటసాల ప్రభుత్వ సంగీత కళాశాల ఆవరణలో జరిగింది. 'శాంతి రజనీకాంత్ స్మారక కవితా పురస్కారం 2016'ను డా॥ ప్రసాదమూర్తి (పూలండోయ్ పూలు), బాల సుధాకర్ మౌళి(ఎగరాల్సిన సమయం)లకు సంయుక్తంగా అందజేశారు. పూలండోయ్ పూలు కవితా సంపుటిని రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, ఎగరాల్సిన సమయం కవితా సంపుటిని జి. లక్ష్మీనరసయ్య సమీక్షిస్తూ ప్రసంగించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన మండలి బుద్ధప్రసాద్ మాట్లాడుతూ ఈ కవితా సంపుటాలు తనను ఎంతగానో ఆకట్టుకున్నాయన్నారు. భాషా, సాంస్కృతిక శాఖ సంచాలకులు డా॥ డి. విజయభాస్కర్ మాట్లాడుతూ మానవీయ విలువలున్న సాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్న శాంతి నారాయణ దంపతులను అభినందించారు. ఈ సందర్భంగా



విజయవాడలో డిసెంబర్ 29న జరిగిన సభలో విమలాశాంతి పురస్కారాలను అందుకుంటున్న డా॥ ప్రసాదమూర్తి, బాల సుధాకర్ మౌళి. చిత్రంలో డా॥ శిఖామణి, మంజులూరి కృష్ణకుమారి, డా॥ డి. విజయభాస్కర్, మండలి బుద్ధప్రసాద్, డా॥ ప్రసాదమూర్తి, బాలసుధాకర్‌మౌళి, శాంతినారాయణ, విమల దంపతులు, మందరపు హైమవతి తదితరులు.

జరిగిన సభకు ప్రముఖ కవి ఖాదర్ మొహియుద్దీన్ అధ్యక్షత వహించారు. ఈ సభలో కొత్తపల్లి రవిబాబు, వొరప్రసాద్, బండ్ల మాధవరావు, మందరపు హైమవతి, ముంజులూరి కృష్ణకుమారి, ఈమని శివనాగిరెడ్డి, శిఖామణి, జి.వి. పూర్ణచంద్, శాంతి నారాయణ, విమల దంపతులు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

❋

## ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన

### అనంతపురంలో రాష్ట్ర సదస్సు కోసం సన్నాహక కమిటీ ఆహ్వానం



సామాజిక, సాహిత్య, సాంస్కృతిక, కళా రంగాలలో కృషి చేస్తున్న వివిధ సంస్థలను అనంతపురంలో 'ప్రజాకవి వేమన సాహితీ సమాలోచన' రాష్ట్ర సదస్సు నిర్వహణలో భాగస్వాములు కావలిసిందిగా విజ్ఞప్తి చేస్తూ సన్నాహక కమిటీ తరపున పి. కుమార స్వామి, జంధ్యాల రఘుబాబు సంయుక్తంగా ఒక ప్రకటనలో కోరారు. ఫిబ్రవరి 12న అనంతపురంలోని సిద్ధార్థ ఫంక్షన్‌హాల్, ఫోలీస్ వెల్ఫేర్ కాంప్లెక్స్‌లో ఉదయం 10 గంటలకు సన్నాహక సమావేశాన్ని ఏర్పాటుచేస్తున్నట్లు తెలిపారు. ఈ సమావేశంలో రాష్ట్ర సదస్సు నిర్వహణకు సంబంధించి ఆహ్వాన సంఘం ప్రకటించడం జరుగుతుందని తెలిపారు. అలాగే రాష్ట్ర సదస్సు నిర్వహణకు సంబంధించి కార్యక్రమ రూపకల్పన చేయడం జరుగుతుందని, ఒక నెల రోజుల పాటు రాష్ట్ర వ్యాప్తంగా వివిధ సంస్థలు, సంఘాల ఆధ్వర్యంలో పాఠశాలలు, కాలేజీలలో వేమన పద్య పఠన పోటీలు, వ్యాస రచన పోటీల నిర్వహణకు సంబంధించి తుది నిర్ణయం తీసుకోవడం జరుగుతుందని తెలిపారు. వేమన సాహిత్యంపై వివిధ కోణాలలో విశ్లేషణలు, చర్చలు ఈ సందర్భంగా జరగాలని, రెండు తెలుగు రాష్ట్రాలకు సంబంధించిన మేధావులు, ప్రసిద్ధ రచయితలు ఈ సదస్సులో పాల్గొనేలా కృషిచేద్దామని ఈ ప్రకటనలో విజ్ఞప్తి చేశారు. మూఢ నమ్మకాలు, కుల వివక్షత వంటి వివిధ సామాజికాంశాలపై పదునైన పద్యాలతో ప్రకంపనలు సృష్టించిన వేమన అవసరం నేటి సమాజానికి మరింతగా అవసరమవుతుందని తెలిపారు. ఇటువంటి విశిష్ట కార్యక్రమంలో వివిధ సంస్థలు భాగస్వాములు కావాలని విజ్ఞప్తి చేశారు. వివరాలకు పి. కుమారస్వామి (అనంతపురం 9490122229, జంధ్యాల రఘుబాబు (కర్నూలు) 9849753298, మస్తాన్‌వలి (కడప) 9490099284, ఓట్ర వెంకటరమణ (చిత్తూరు) 9494512930 ద్వారా సంప్రదించవలసిందిగా కోరారు. ❋

## హేతువాదం - మానవ వికాసం సదస్సు



సమాజంలో హేతువాదం వర్ధిల్లితేనే మానవత్వం పరిమళిస్తుందని, సాహిత్యం, కళలు ఇందుకు ఇతోధికంగా దోహదపడాలని ప్రముఖ సామాజిక కార్యకర్త, విజయవాడ నాస్తిక కేంద్రం నిర్వాహకులు డా॥ విజయం అన్నారు. విశాఖపట్నంలో సాహితీస్రవంతి, ప్రజాశక్తి బుక్‌హౌస్ సంయుక్తంగా జనవరి 29న నిర్వహించిన 'హేతువాదం - మానవ వికాసం' సదస్సులో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. ఈ సందర్భంగా గోరా రచనలను, ఆవిష్కరించారు. అనంతరం శాసనమండలి సభ్యులు ఎం.వి.ఎస్. శర్మ సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'స్వేచ్ఛా స్వరం' ఆవిష్కరించి మాట్లాడారు. అభ్యుదయ వాదులందరూ విభేదాలు పక్కనపెట్టి ఏకమవ్వాలని, అప్పుడే సమాజంలో పెరుగుతున్న మూఢత్వాన్ని, తిరోగమన భావాలను ఎదిరించి ముందుకు వెళ్ళగలమని అన్నారు. ఈ సదస్సులో ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకురాలు కె. ఉషారాణి, డా॥ మాటూరి శ్రీనివాస్, అరసం విశాఖ అధ్యక్షులు ఉప్పల అప్పలరాజు, నాస్తిక సమాజం అధ్యక్షులు వర్మ, వైజాగ్ ఫిల్మ్ సొసైటీ సహాయ కార్యదర్శి పి.వి. రమణ, పౌరహక్కుల సంఘం విశాఖ అధ్యక్షులు టి. శ్రీరామమూర్తి, సాహితీస్రవంతి విశాఖ జిల్లా ప్రధాన కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు, అధ్యక్షులు ఎ.వి. రమణారావు, ఎస్. నాగరాజు, సుజాతామూర్తి, వైష్ణవి, సత్యాజీ తదితరులు పాల్గొన్నారు. ❋



విజయనగరంలో జనవరి 17న చాగంటి సోమయాజులు కథా పురస్కారాన్ని అందుకుంటున్న 'బ్లాక్ ఇంక్' కథల రచయిత్రి ఎం.ఎం. వినోదిని. చిత్రంలో కేతు విశ్వనాథరెడ్డి, చాగంటి తులసి, చాగంటి కృష్ణకుమారి, చీకటి దివాకర్ తదితరులు



సాహితీస్రవంతి ఆధ్వర్యంలో విజయనగరంలో గురజాడ స్వగృహంలో జనవరి 2న జరిగిన చాసో వర్ధంతి సభ. చిత్రంలో కమల కుమారి, గంటేడ గౌరునాయుడు, చీకటి దివాకర్, ద్వారం దుర్గా ప్రసాద్.

## సాహితీస్రవంతి ఆదోని డివిజన్ నూతన కార్యవర్గం

కర్నూలు జిల్లా ఆదోని డివిజన్ నూతన కార్యవర్గం డిసెంబర్ 18న ఆదోని పట్టణంలోని నేషనల్ హైస్కూల్‌లో జరిగింది. ఆవుల బసప్ప ఆధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో నూతన కార్యవర్గాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకోవడం జరిగింది. ఆదోని డివిజన్ గౌరవాధ్యక్షులుగా ఎన్ నాగమణి, అధ్యక్షులుగా ఆవులబసప్ప, ప్రధానకార్యదర్శిగా రాజా జయచంద్రన్, ఉపాధ్యక్షులుగా సక్కిరి భాస్కర్ కోశాధికారిగా కరేపాకుల రఘురాం, సంయుక్త కార్యదర్శులుగా గొంగళ్ళ నల్లారెడ్డి, ఊదు సుబ్బన్న, సభ్యులుగా వెంకటరెడ్డి, మాధన్న, పూజిత్, గోపాల్‌లు ఎన్నికయ్యారు. ఈ సమావేశానికి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ హాజరై సాహితీస్రవంతి చేపట్టే కార్యక్రమాలను సమర్ధవంతంగా నిర్వహించాలని అన్నారు. ప్రపంచీకరణ, మతోన్మాదం, ఉగ్రవాదం తదితర అంశాలను తిప్పేకొట్టేలా మన గళాలు కలాలు ఉండాలన్నారు. నూతన కమిటీని ఈ సందర్భంగా అభినందించారు.

## పెద్ద నోట్ల రద్దుపై కవితలకు ఆహ్వానం

**'పెద్దనోట్ల రద్దు'** అంశంతో తెలుగు రాష్ట్రాలు, ఇతర రాష్ట్రాలలో నివసిస్తున్న తెలుగు కవులనుండి 30 లైన్లకు మించని వచన కవితల్ని ఆహ్వానిస్తున్నట్లు చీకోలు సుందరయ్య ఒక ప్రకటనలో కోరారు. 'అక్షరం ప్రచురణలు' తరపున ఈ అంశంపై ఒక కవితా సంకలనం వెలువరిస్తామని తెలిపారు. కవితలు ఫిబ్రవరి 25వ తేదీలోపు 'చీకోలు సుందరయ్య, అక్షరం ప్రచురణలు, ఇం.నెం. 6-3-609/53, ఫ్లాట్ నెం.201, కృపాదేవి రెసిడెన్సీ, ఆనంద్ నగర్, ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004 చిరునామాకు పంపించ వలసిందిగా కోరారు. వివరాలకు 9030000696, విల్సన్‌రావు 08985435515, **cheekolu.sundaraiah@gmail.com** **k.wilsonrao@gmail.com** ద్వారా సంప్రదించ వచ్చును.

## చిన్న కథల పోటీ ఫలితాలు

సోమేపల్లి హనుమంతరావు గారి స్మృత్యర్థం, రమ్య భారతి సాహిత్య త్రైమాస పత్రిక ఆధ్వర్యంలో నిర్వహించిన చిన్న కథల పోటీలో ప్రముఖ రచయిత సింహప్రసాద్ రాసిన 'మనుష్యరుణం' కథకు ప్రథమ స్థాయి పురస్కారం లభించినట్లు చలపాక ప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పోటీలకు 126 కథలు వచ్చాయని, ద్వితీయ బహుమతి తటవర్తి నాగేశ్వరి (కొవ్వూరు) రాసిన 'రఘుపతి రాఘవ రాజారాం' కథకు, తృతీయ బహుమతి రంగనాథ రామచంద్రరావు (హైదరాబాద్) రాసిన 'నాలుగు ఉత్తరాలు' కథకు, ప్రోత్సాహక కథలుగా ఎమ్.ఎస్. శాయిబాబు(గుంటూరు) రాసిన 'పండుగ జరుపుకుందాం', వియోగి (కర్నూలు) రాసిన 'తాపత్రయం', మంత్రవాది మహేశ్వర్ (హైదరాబాద్) రాసిన 'మాటకందని మౌనం' కథలు ఎన్నికైనట్టు తెలిపారు. ఈ పోటీలకు కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ న్యాయనిర్ణేతగా వ్యవహరించినట్లు ఆ ప్రకటనలో తెలిపారు.

**జనవరి సంచికలో కడియాల రామ్మోహన్‌రాయ్ గారి 'సప్తతి' కవితలో మొదటి రెండు వాక్యాలు సంబంధంలేనివి కలిశాయి. "సెవెంటీ క్రాస్ చేశారా?" నుండి ప్రారంభంగా గమనించగలరు. పొరపాటుకు చింతిస్తున్నాం.**

**- వర్కింగ్ ఎడిటర్**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# ముఖ్దూం మొహియుద్దీన్

(04.02.1908-24.08.1969)



హైదరాబాద్‌లో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు. తెలంగాణా పోరాటానికి తోడు నిలిచిన యోధుడు. ప్రసిద్ధ ఉర్దూ కవి, వక్త.

Date of Posting : 02.02.2017 ▪ Date of Publication: 28.01.2017

PRSVIMO2A177

## ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల. 140/-




వెల. 25/-




వెల. 45/-




వెల. 75/-




వెల. 20/-




వెల. 70/-




వెల. 150/-




వెల. 140/-




వెల. 130/-




వెల. 35/-




వెల. 350/-




వెల. 250/-







ప్రతులకు

**ప్రజాశక్తి బుక్‌హౌస్**

27-1-64,
కారల్‌మార్క్స్ రోడ్,
విజయవాడ - 520 002
ఫోన్ : 0866 - 2577533

If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMo2A1-7 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Kaveen |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |